శ్రీ

# వరూధిని.

(మూడు అంకముల తెనుగు నాటకము.)

ఇది

బళ్లారిలో నుండిన డిస్ట్రిక్టు కోర్టుప్లీడరు

"ఆంధ్రనాటక పితామహ" యను బిరుదువహించిన

## ధర్మవరము - రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. కె. కృష్ణమాచార్లు, వారిసహోదరులవలన ప్రకటింపబడియె.

---

మొదటి కూర్పు.

---

బళ్లారి.

రమావిలాసప్రెస్సున అచ్చుకూర్పబడి

కామేశ్వరి ముద్రాక్షర శాలయందు

యం. పి. శర్మ కంపెనీవారిచే ముద్రింపఁబడియె

---

1917



[ క్రయము రూ. 1-0-0 ]

శ్రీ

# పీఠిక

ఆంధ్రకవితాపితామహుండని సన్నుతి గాంచిన యల్లసానిపెద్దనార్యునిచే రచింపఁ బడిన స్వారోచిషమనుచరిత్రము నుండియే యిందలి యితివృత్తము గ్రహింపఁ బడియున్నది. రంగస్థలమున కెక్కించి ప్రదర్శనార్హముగ నొనర్చుటకై యీ మనుచరిత్రమునం దొకటిరెండు చిన్నమార్పులొనర్పఁ బడియున్నను నీవరూథినియే యావరూథినియె ప్రవరాఖ్యాగల యుత్తమ వర్తనమునింకను విస్తారముగ వెల్లడించునుద్దేశము తోడనే యీ నాటకము వ్రాయఁబడియుండు నట్లుతోఁచుచున్నది

ఈ నాటకములోని పద్యములలోఁ బెక్కులు సందర్భము ననుసరించి మనుచరిత్రమునుండి యేకైకొన బడియున్నవి. చరిత్రమో యితిహాసమో నీతియో, పట్టువడవలెనన్నఁ బురాణప్రథాదులకంటె నాటకములమునవే త్వరలోను దృఢతరముగను బట్టువడునని పండితులలో భలువుర యభిప్రాయమైయున్నది. పరోక్షమునకంటెఁ బ్రత్యక్షము శ్రేష్ఠతరమేకదా? కావున బురాణాదుల యు, నాటకముల యు శైలి వేఱువేఱుగ నుండుననుట యెల్లరిచే నంగీకరింపఁబడిన ప్రసిద్ధమగుసంగతి. అయినను శ్రీమదాంధ్ర మహాభాగవతమును బోలిన కొన్ని పురాణములును మనుచరిత్రమును బోలినకొన్ని ప్రబంధములును బెక్కుచోట్ల నాటకశైలిని రాజిల్లుచున్నవి. ఆ చోట్లఁగల సందర్భములనే నాటకములలో నిరూపింప వలసివచ్చినప్పుడా తొల్లింటికవులచే నిర్ధరింపఁబడిన మనోహర పద్యములనే యీ నాటకములలోఁ గైకొనుట మిగుల శ్లాఘనీయమగ పద్ధతియని యెన్నవలసి యున్నది. ఈ విషయము చక్కఁగ నెఱింగియుండుటయే రామకృష్ణమ చార్యుఁడు తాను రచించిన ప్రహ్లాద చరిత్రమున నాంధ్రభాగవతములో పద్యములును నీ వరూధిని నాటకమున మనుచరిత్రములోని పద్యములును విశేషముగఁ గైకొని యుండుటకుఁ గారణమున తెలియవచ్చుచున్నది. నిక్కమారసిచూడఁ నొక్క ప్రహ్లాద చరిత్రమును నాటకరూపము నెందఱో కవులు రచించి తమ శక్తికొలంది సందర్భానుసారముగ నెన్నియో రమ్యములగు పదముల వ్రాసియున్నను, నా పద్యములలో నొక్కటియు నాంధ్రభాగవతములోని పద్యము కొక్కటికిని దీటురాఁజాలదని యొత్తిచెప్ప నా సాహసము మన్నింపఁబడుఁగాక.

మనుచరిత్రములోని పద్యములనే యీ నాటకమునఁ గైకొనియుండుట పెద్దలకును రా కృష్ణునకును శ్రేయోదాయకమనియే వచింపవలసి యున్నది. కొందఱికి మాత్రము గ్రాహ్యము నా ప్రబంధము నాటకరూపమున వెలసెనేని పలువురు గ్రహించుట కవకాశ మొదవుచున్న ఇంక నా ప్రబంధ రాజ్యములలోని రసవంతములగు పద్యములును నాటకములోఁ గైకొనఁబ నా దిదృక్షువు లా పద్యములలోని రసమును మనసారఁ గ్రోలి యానందించుటచే వారిలో నవేక కా పద్యముల రచించిన యా ప్రబంధకర్తపై నత్యంతాదరమును, గౌరవమును గలుగుచున్న వేఱుగ నుడువ నవసరము గలుగదు. ఇఁక నట్లా ప్రబంధకర్తపైఁ బలువురకు గౌరవాదరము గలిగించుచు నాటకకర్తయు స్తుతిపాత్రుఁడేకదా?

ఈ మహాకవి రచించిన యితర నాటకములవలెనే యీ వరూధిని నాటకమును నాం లోకమున నెల్లెడల నెంతయు నాదరింపఁబడి తనుఁగాంచిన మహాత్ముని కవ్వాయ సత్కీ నించుఁగాక.

బళ్లారి,
22—9—17.

ఇట్లు విన్నవించు నొక
భాషాసేవకుఁడు.

# వరూధినీనాటకము

## కథాసారాంశము

—:(ACT. I ప్రథమాంకము.):—

రం. I విదూషకుడను మిత్రుడునగు శతానందుడు, వీరసేనుని హాస్యము చేయును. వీరసేనునకు వరూధినిపైగల మోహము.

రం. 2 వీరసేనుడు వరూధినింగూర్చు మనితిలోత్తమను వేడుట.

రం. 3 ప్రవరుడను బ్రాహ్మణుం డొకసిద్ధునివలన ఆకార సంచారయోగ్యమగు పాదలేపము నుపొందుట.

రం. 4 వీరసేనుడు వరూధిని లభింపమిచే తపించుట. శతానందుని హాస్యము

రం. 5 సిద్ధపుషధమహిమచే ప్రవరుడు హిమవత్పర్వతము చేరుట. ఆ యౌషధము మంచున కఱిగిపోవుటచే నూరికి పోవజాలక చింతిల్లుట.

రం. 6 వీరసేనుని మోహింపని వరూధిని ప్రవరుని మోహించుట. ప్రవరుని అనంగీకారము ప్రవరుడు అగ్నిదేవుని మహిమ వేత యూరుచేరుట. (మిక్కిలి శృంగార భూయిష్టమగు దీర్ఘరంగము.]

—( ACT II. ద్వితీయాంకము. )—

రం. I వరూధిని మోహభ్రాంతుడగు వీరసేనుడు ప్రవర వేషము ధరింప నుద్దేశించును.

రం. 2 మాయాప్రవర శతానందుల సంవాదము. (వినోదరంగము) అతనిని తిలోత్తమయు పిదప వరూధినియుం జూచుట వరూధినీ మాయాప్రవరుల వినోద సంభాషణము.

రం. 3 వరూధినీసంగమంబున మైమరచి నమాయాప్రవరుడగు వీరసేనుడే నిద్రించుచుండ మొదటిరూపము బయటంబడును. గర్భవతియగు వరూధిని యతనిని పాషాణముకమ్మని శపించుట. వానిప్రతిహాసము.

—(ACT III. తృతీయాంకము.)—

రం. 1 చక్రవంత సారస్వతులను బ్రాహ్మణులసంభాషణము. (మిక్కిలి హాస్యకరరంగములు)

రం. 2 వరూధిని కొడుకగు స్వరోచివే దిమనోరమయను గంధర్వకొమారిని నొక రాక్షసుండు తరుముకొని వచ్చుట. స్వరోచి వానిని శిక్షించుట. వాడు శాపవిముక్తుండై యిందీవరాక్ష గంధర్వుడగుట. శాపమున పడియున్న వరూధినీధ్వనిని స్వరోచివిని సిద్ధునివలన శాపక్రమవినుట

రం. 3 ప్రవర బ్రాహ్మణుని పిలుచుకొని రాను పోయిన కంధర మంధరులను నిద్దరుభటులు దొంగలవలన దోచబడి ప్రవరుని యూరుపేరులు మఱచి జ్ఞాపకమున క్రొత్తవి కల్పించుకొని వెదుకబోవుట.

రం. 4 ఇందీవరాక్షుడును స్వరోచియు తామే ప్రవరుని ప్రవరునొద్దకు పోవనెంచుట.

రం. 5 భంగిని ప్రశంసించుచు మత్తులైయున్న బైరాగులయొద్దకు కంధర మంధరులువచ్చి ప్రవర బ్రాహ్మణునకు మారుగా తవర బైరాగినిపట్టి మోసికొనిపోవుట

రం. 6 ప్రవరుడు వరూధినీ వీరసేనుల శాపముతొలగించుట మనోరమ స్వరోచు వాహము.

ఉత్తరరంగము మంగళము.

శ్రీ

# —: వరూధినీ నాటకము. :—

## ప్రథమాఙ్కము - ప్రథమరంగము.

హిమవత్పర్వతసానుదేశము.

[ ప్రవేశము: వీరసేనుఁడు, శతానందుఁడు. ]

వీర=శతానందా! నీవు చెప్పుదువుగాని, ఆచింత యెట్లు విడిచిపెట్టవలయును?

శతా=దానినిఁ దలచుకొనక నేయున్నసరి.

వీర=తలఁచుకొనరాదని యోచింపుటయే తలఁపునకు మరల మరలఁ దెచ్చుఁగదా!

శతా=నీవేమో యింత తిరస్కృతుఁడవయియుండియు నింకను నభిమానము వహించియున్నావు గాక నేనైయుండిన దాని ముఖావలోకనమయినఁ జేసియుండను.

వీర=అయ్యో! శతానందా ఆకాంతామణి యనంత విలాసాతిశయముగలది గాన నాకెట్లు వదల నగును.

క॥ సరిలేని విలసనంబున
నరుదారెడు లోకమోహ నానందవిభా
సురుచిర రూపముగాంచినఁ
దరమే మఱువంగ వికచ తామరసాక్షీ॥

అట్టిరూపమువిడువక నామోమున వ్రేలుచున్నదిగదా విదూషకా?

శతా=మోమున వ్రేలుచున్నదా? అయిన నాముఖమును ప్రక్షాళనము చేసికొనుము.

వీర=ముఖప్రక్షాళనము యుండినందున నేకదా యీగతి గలిగియున్నది.

శతా=బాగాయెను. సురపులగు కాంతామణు లెందరు లేరు? కోటివత్తురుగదా నీవుకోరిన. అట్లుండఁగా నావరూధినినే కలువరించుకొనుచు నీవు సంతాపము జెందెదవే?

వీర=అయ్యో! శతానందా! కోటివధూటులైన నాబోటి కొనగోటియైనవత్తురా?

శతా—కం॥ పలుమారు ప్రశంసించెద
వలయకయలవండిపోలె నావ-తయునన్
దిలకింపదు నిన్నాసతి
దలపోయఁగ సిగ్గుగలుగదా నీమదికిన్॥

ఇట్టికాముకుల నెందైనఁగంటిమే? ఆవరూధిని వీనిఁ గన్నెత్తియైన చూడదు. ఇట్లుండియు వీనికి భ్రాంతివదలదు.

వీర=శతానందా! నీవంతువు. నేనేమిచేయుదును? ఆ వధూమణియొద్దకు బోవలెనన్న నాకు రెక్కలుగట్టినట్లగును.

శతా=అయిన నీవెంటనే నెక్కడ నెగురులాడఁగలను. గగనముగదా నీ సంచారస్థలము.

వీర=అబద్ధముగాదు. ఇంక నాచెలిచెంతఁబాసి రావలయునన్నఁ గాళ్లకు గుండ్లు గట్టినట్లుండు,

శతా=అప్పుడు నీ వీదులాడబోయిన బాగుగానుండును.

వీర=విదూషకా! నీవు హాస్యముమాత్రము చేయుదువు గాని నా సంతాప మించుకైనను విచారింపవుగదా? అహా!

(అనుబంధము 1.)

శతా=మిత్రమా! నీవింతైన యోచింపవలదా? ఒక వనితకై యిట్లు దుఃఖింపఁదగునా? నీవు వరూధిని చెలికత్తెలగు తిలోత్తమ, శశిరేఖలతోఁ జెప్పియుంటివే. పోయి విచారింతమురమ్ము.

(నిష్క్రమింతురు.)

—— (: o :) ——

[ ద్వితీయరంగము — హిమవత్పర్వతసానుదేశము. ]
[ ప్రవేశము : తిలోత్తమ - శశిరేఖ ]

తిలో=చూచితివా శశిరేఖా! మన వరూధినికెంత యుత్కర్షము? ఆ వీరసేనుని పేరెత్తిన చెవులు మూసికొనుచున్నది.

శశి=వానిఁగాక యింకెట్టివాని వరింపఁగలదో?

తిలో=సఖియా! ఎట్లయిననుజేసి మన మీకార్యము సాధింపవలయు.

శశి=ఆ వీరసేనుఁడుబహు సంతాపమువలన వాఁడు బ్రదుకునట్టులేదు.

తిలో=అదిగో అతఁడే వచ్చుచున్నాఁడు.

[ ప్ర॥ వీరసేనుఁడు — శతానంద. ]

వీర=తిలోత్తమా! యేమయినది.

తిలో=గంధర్వశిరోమణీ! కొంచము నిమ్మళింపుము.

వీర=నిమ్మళించుటయట్లుండనీ - కాయా - పండా, తొట్రఁజెప్పుము.

తిలో=ఇట్లాతురమైన నెట్లు. నేఁడు గాకున్న నింకొకనాఁడైన సంతోషము కాఁగలదు.

వీర=సంతోషమట్లుండనీ, నేనడిగినదిచెప్పుము. కాయా?

తిలో=కాయగాదు.

వీర=అయినఁబండా?

తిలో=పండు గాదు.

వీర=ఇట్లన్న -

తిలో=రెండిటికి నడుమనున్నది.

శతా=అదే కడుసొంపు.

వీర—ఏది?

శతా—దోరగాయ. నీవెఱుఁగవా పండీపఁడనిపండు. వచ్చీరానిమాట. పేటీపేఅని వెరుసు. కదురుచియని? ఇంకనేవే యదృష్టమంతుఁడవు.

వీర—అదేల?

శతా—అన్యాగదానను?

శశి—నేకుభ్రాంతి. ఇంకనది ముష్కరమేపట్టియున్నది.

వీర—ఆహా! నేనింకేమిసేయుదును

(అనుబంధము 2.)

శతా—ఆహా! వీరసేనా నీవిట్లు దుఃఖింపఁదగునా? ఊరడిల్లుము.

(అనుబంధము 3)

వీర—అకటా శతానందా! నే నింకెట్లూరడిల్లఁగలను. ఈ శశిరేఖా తిలోత్తమల ప్రయత్నము నిష్ఫలమాయెఁగదా? నాకేటికింకజీవము.

తిలో—గంధర్వోత్తమా! నీవు నిరాశుఁడవు కావుము. ఇంకను మేము ప్రయత్నముజేసెదము. మాయట్టివారలు నీకు మిత్రులైయుండఁగ నిట్లుచింతిల్లవచ్చునా? మేమెట్లైన సాధింతుములెమ్ము (నిష్క్రమింతురు).

[తృతీయరంగము — అరుణాస్పదపురము,]

ప్రవరునియిల్లు,

[ప॥ ప్రవరుఁడు. (ఆహుతులిచ్చుచు) 2, 3గురు బ్రాహ్మణులు.]

ప్రవ—(ఆహుతులైనపిదప) ఆహా! బ్రాహ్మణులారా నేఁడెవ్వరు అతిథులురారైరి. ఒక్కనాఁడింత యతిథిరాకున్న నాకు మనసునకు నెమ్మది గలుగదుగా.

1 బ్రా—పాతనాఁడిచెంత నొక మహాయోగి వచ్చియుండి నేఁడే యిచ్చటికి మీయింటికి రానున్నాఁడనికదా యాతఁడుచెప్పెను.

ప్రస — ఆహా! ఒకదినముననే సులీలగా నాపద్మనాభుని కౌమారునికి ౫ సంవత్సరముల క్రిందటఁ బోయినకన్నులు కలిగించినాఁడని వింటిమే - అతడా? చూచితిరే మిత్రులారా! సిద్ధపుంగవుని మహాత్మ్య మింతని పొగడ నలవిగాదు.

1 బ్రా — ఇదిగో యనుకొనువేళకే యాసిద్ధుఁడరుదెంచెను.

[ ప్ర॥ సిద్ధుఁడు. ]

( అందఱు నమస్కరింతురు. )

ప్రస — సిద్ధపుంగవా! నిను దర్శింపఁ గలన నేను మిక్కిలి ధన్యుఁడనైతిని. నీ చరణ రజోమాత్రంబున నాగృహము పవిత్రమై నాకోరిక ఫలించెను.

(అనుబంధము 4.)

సిద్ధ — బ్రాహ్మణోత్తమా! అతిథిదేవ భూదేవభక్తియుతుండవైన నీయట్టి గృహస్థరత్నమును నేనెందును జూచియెఱుఁగను. నిన్నుఁ దర్శించుట నాకును భాగ్యోదయమేగదా?

ప్రస — యోగీంద్రా! విజయము చేయుఁడు. (కూర్చుందురు.) విజ్ఞశిరోమణీ! కకపాల, కేదార కటకముద్రితపాణివై యారహటచ్ఛాయ చేరాజిల్లు శరీరముగల్గ మూడవకన్నుమూసిన చంద్రశేఖరునివలె విలసిల్లు నిన్నుఁ గన్నప్పటినుండి నా యానంద మింతని వచింపఁజాలను. ఎల్లప్పుడు తీర్థసంవాసులవలన వనధిపర్వత సరిత్తీరమహాత్మ్యముల వినుచుందును. వారు నా కనుగ్రహించి యెఱిఁగించు మందురు. మిమ్ము నొకమాట యడుగవచ్చునా?

సిద్ధ — బ్రాహ్మణోత్తమా! ఏల యిట్లు సంకోచించెదవు. అవశ్యకముగా నడుగుము.

ప్రస — శా॥ ఏయే దేశముల న్వసించితిరి మీ రేయేగిరుల్సాచినా।
రేయేతీర్థములందు గ్రుంకిడితి రేయేద్వీపముల్ మెట్టినా।
రేయేపుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రేయేతోయధుల్డాసినా।
రాయాచోటులఁగల్గువింతలు మహాత్మా నాకెఱింగింపవే॥

ఆయాస్థలములు బోయి సేవింపఁజాలకున్నను వానిమహాత్మ్యము వినుటయే పుణ్యము.

సిద్ధ—భూసురతిలకా! ఇందుకింత పీఠిక కావలయునా. ఈ యా దేశముల స్థలములు చూచినానని యేల వచింపవలెను? ఈ యాసేతు హిమాచలస్థలమగు భూమండలింగలుగు సర్వపుణ్యతీర్థములం దర్శించియున్నాను. దానింతయు నిప్పుడు వర్ణింపను సమధికోత్సాహము బొడమెడు. లంబమానరవి రథతురంగచామరంబులు చూచు నుత్సాహముగల చమరీసమూహంబుగల యుదయాద్రియందుఁగల విశేషములు శేషఫణికైన లెక్కజేయ శక్యమగునా? అంధకారియగు శంకరున కాభరణప్రాయమై యున్న వాసుకియొక్క వియోగవ్యథఁజిక్కిన భోగినీసముదయములచేఁ బరివేష్టితములైన శ్రీచందనవృక్షములనాశ్రయించియున్న యేలాలతాజాలములుగల మలయాద్రియొక్క మనోహరమైన చలువకు సమమెందైనఁ గలుగునే? అకటా! వికటకూటకోటివిటంకశృంగాటకములును, ముదిజాబిల్లివలనజారిన యమృతబిందువులచే జల్లనైన ప్రదేశంబులును గలయస్తాద్రియందలి మణిప్రస్తరంబుల విశ్రాంతిఁ జింతించిన నిప్పటికిని శరీరమున రోమాంచము లెగయుచున్నవి. వర్ధమాన ధరణీసుహృత్సందోహ సందోహాద్రప్రధాన ఖిలదైలబిలవిలాసినీ విలాసవాచాలతులకోటి కలకలాహూయమాన మదాలసమరాళంబగు రజితశైలంబునుఁ గనుఁగొన్న భవపాశంబులూడవే. పరిస్ఫురదరవింద కందళవ్రాతంబులచే నిండిన మేరుపర్వతంబు శిఖరంబుల సోయగంబుల గనుంగొనుటకు బహుజన్మకృత సుకృతపరిపాకముండవలయుఁగదా? ఈశ్వరానుగ్రహంబున నీ మహాద్భుతంబులన్నియుఁ గనుంగొనియున్నాను.

ప్రవ—మహాత్మా! భయముఁజెందక మీకొక విన్నపమొనరించెదను. మీ రూపముఁజూచిన మిక్కిలి చిరుతవయసు తెలియుచున్నది. ఈ స్థలములన్నియు జూచుట కెన్నియోసంవత్సరములు కావలయునే.—

సిద్ధ—ఆహా! బ్రాహ్మణోత్తమా. పాదచారులమై మేము ఈ స్థలంబుల దర్శింపవలయునన్న మావలనేమగును.

ప్రవ—మఱి యింకెట్లు చేయుదురు?

సిద్ధ—ఇది పరమరహస్యము. అయినను నీ యుత్తమభక్తిచే సాభిలాషంబుగ నీ వడిగెదవు. కావునఁ దాపక చెప్పెదను. మేము సేవించిన యోషధుల ప్రభావంబున మేమొక పాదలేపము జేసియున్నాము. దానినింత కాళ్లకుఁ జరుముకొని యొకమంత్రమును రెండు మారులుచ్చరించి "ఆచార్యా! ఈ యెడకు పోవలయును" అని చెప్పినఁ గావలసినయెడకుం బోవచ్చును.

ప్రవ — సిద్ధచంద్రా! కరుణాలవాలుఁడవైన నీవింత యనుగ్రహింపనడుగుచున్నాను: నాకు నిస్వదేశ దిదృక్ష మిగులగానున్నది. ఆ మంత్రమును ఆ పాదలేపమును ప్రసాదింప నాక్షేపము కలుగదేని. —

సిద్ధ — బ్రాహ్మణుల కాశ మెండను మాటకు దృష్టాంత —

ప్రవ — యోగీంద్రా! అయిన నను క్షమింపుఁడు మీ కసమాధానమైన —

సిద్ధ — వేయేల కంటిగాక నా కసమాధానమేదియు లేదు. అవశ్యము. నీకు మంత్రోపదేశము చేయుదును. పాదలేపము నిచ్చెదను. రమ్ము.

ప్రవ — ఇప్పుడుగదా నేను ధన్యుఁడనైతిని.

[అనుబంధము 5.]

(నిష్క్రమింతురు.)

## తురీయరంగము — (హిమవత్పర్వత ప్రాంతభూమి.)

[ప్ర॥ వీరసేన — తిలోత్తమ.]

తిలో — వీరసేనా! నేనేమి చేయుదును. నేఁడు నీవును జూచితివిగదా. పరాధీన యేమికాఁగలదో యొకచేపట్టు పట్టినది.

వీర — తిలోత్తమా! ఇక నేను ప్రాణము నెట్లు భరింపఁగలను.

(అనుబంధము 6)

తిలో — మిత్రమా! సమంచిత మనోదార్ఢ్యమున నెక్కుడనిపించుకొన్న నీవే యిట్లు వెతచేఁ బొగలుటతగునా.

(అనుబంధము 7.)

నీవు దుఃఖింపకుము. ఎట్లయినను జేసి నింకొక్కసారి ప్రయత్నము చేయుదును. అదిగో నీ మిత్రుండు శతానందుఁడు వచ్చుచున్నాఁడు. నేనిఁక బోయెదను.

(నిష్క్ర — 9)

[ప్ర॥ శతానందుఁడు ]

శతా—వీరసేనా! సుమిత్రుఁడు కువలాశ్వుఁడు పిలుచుచున్నాఁడు రమ్ము. ఏమి మాటలాడక యిట్లున్నావు?

వీర—శతానందా! కువలాశ్వుఁడెవరు?

శతా—కువలాశ్వుఁడెవరు? ఇంతపని వచ్చెనా? నేఁడేల యిట్లయితివి?

వీర—శతానందా! మనమిప్పుడెక్కడనున్నాము?

శతా—అదియేమట్లడిగెదవు?

వీర—నాకీ హిమవత్పర్వతము తల్లక్రిందుగా నిలిచినట్లున్నది.

శతా—అయిన కైపు బలమైనది. ఇంకనీవు కాళ్లు మీఁదచేసి నడువుము. నీవును దల్లక్రిందఁగమ్ము.

వీర—ఎంత తల్లక్రిందైనను వరూధినియేమో లభింపదుగదా?

వీర—మిత్రమా! యిది కేవలము పామరత. ఇంత తిరస్కరింపఁబడియు నాకాంతపైబడి దుఃఖించుచున్నావుగదా?

వీర—ఎంత తిరస్కరింపబడినను, ఆ కాంతపైఁబడఁగలిగినఁ జాలుగదా?

శతా—(స్వగతము) ఇంకేమిచేయవలయు. ఏమన్నను ఆలోకముగానేయున్నదిగదా? (ప్రకాశము) మిత్రమా! ఆ సరోవరమున నా తామర లెంతమనోహరముగానున్నవి? చూచితివా! ఆమధురసము నీ భృంగీసంతానము లెట్లు గ్రోలుచున్నవి.

వీర—శతానందా! ఈ భృంగముభాగ్యము నాకెన్నటికిఁగలుగును. ఆ రమణీవదనకమలమునందలి యధరసుధారసము నిట్లే గ్రోలుభాగ్యము నాకబ్బునా?

శతా—పోదమురమ్ము. ఇక్కడచూడుమా! ఈ లికుచ ఫలంబులు ఎంత పెద్దవిగానున్నవి? చేతికబ్బకయున్నవి.

వీర—ఇదేమింత? ఆ వరూధిని కుచలికుచంబు లిట్లే నా చేతికబ్బకయున్నవిగదా?

శతా—చూచితివా! యీ మాధవీలత యీ పున్నాగవృక్షము నెట్లు చుట్టుకొనియున్నది?

వీర — ఆహా! ఆ లతాతన్వి యాశ్లేషింపఁగల పున్నాగము నేనగుట యెన్నఁడో కదా ?

శతా — ఈ సరోవరమునందలి గండుమీలు ఎట్లు మునిగి మునిగి తేలుచున్నవి.

వీర — ఆ తరుణీమణి విలాసాంబుధిలో దాని నేత్రమీనము లిట్లే విలసిల్లుచున్నవిగదా ?

శతా — ఏమాటాడినను ఆ చింతయే ?

వీర — ఆ తన్వంగిమయత్వము నన్నావరించియున్నది.

శతా — ఇట్లున్న నెన్నటికిమోక్షము ?

వీర — తన్వీ వీమోక్షమున నే.

శతా — చాలు నింక నాకు సిగ్గగుచున్నది.

వీర — నా సిగ్గెక్కడికో పోయిన గదా ? నేనేమి మాటలాడుచున్నానో నేనే యెఱుఁగను.

శతా — ఇంక చాలును పోదము రమ్ము.

వీర — శతానందా! అడిగో వరూధిని వచ్చుచున్నది, చూడుము. ఇఁక నా సంతోషమున కేది మేర ?

శతా — (కన్నులు తుడుచుకొని) ఇట్టి భ్రమ వీనికిఁ గలుగనే. — హే — హే — (అదలించును).

వీర — ఏమది అట్లదలించుచున్నావు.

శతా — అక్కడ వచ్చుచున్న యెనుపుగొడ్డును

వీర — ఎనుపుగొడ్డెక్కడ ?

శతా — ఆహా యిప్పుడుగదా తెలిసెను. నీకన్నులకు వరూధినిఁ గనుపించినట్లాయెగదా ? నా కన్నుల కెనుపుగొడ్డు కనుబడినట్లాయెను.

వీర — శతానందా ! నన్నిట్లేల చేయుచున్నావు. నేనేమి సేయుదును. కనుమూసిన నాకు వరూధిని గన్పించుచున్నది.

శతా—ఆహా! మహిషీ నన్నిట్లేలఁ జేయుచున్నావు. కనుమూసిన నీవు గన్పించుచున్నావుగదా ?

వీర—ఆహా! వరూధినీ! అప్సరోరత్నమా ! ఇందిరేశున కాటపట్టగు పాలసముద్రుడుగదా నీ తండ్రి. ఆతని మెత్తదన మించుకైనను నీవు వహించక యిట్లలింప వచ్చునే?

శతా—ఆహా! మహిషీ! చతుష్పాద్రత్నమా ! లోకాంతకరుండైన యముని వాహన శ్రేష్ఠముగదా నీ పితామహుఁడు అట్టి ఖరగుణము వహించి నీవు నాయొద్దకు రావచ్చునా ?

వీర—విదూషకా ! నా సంతాప మేమని చెప్పుదు. వరూధిని ! ఇంక నీ జాగుచాలుచేసి నాకు మనోహరాలింగనమిమ్మా?

(అనుబంధము 8.)

శతా—ఆహా! బర్రెగొడ్డా! మహిష శ్రేష్ఠమా! ఇంక నీ యాతురము చాలించి వెనుకకుబొమ్మా!

(అనుబంధము 9.)

వీర—విదూషకా ! నా సంతాపమునకు దుఃఖింపవలయునా —నీ మాటలకు నవ్వవలయునా.

శతా—నీ గతికి నేను నవ్వవలయునా—నా చమత్కారమున కేడవ వలయునా ? కాని ! వీరసేనా! నీ వరూధిని నాకునిచ్చి నా మహిషిని నీవుఁ గైకొనుము.

వీర—ఇట్టి సమయమున నన్ను నవ్వులాడెదవా? మిత్రమా! హా! వరూధినీ— (అని క్రిందపడును)

శతా—హా! మహిషీ! (అని క్రిందపడును.)

యవనిక దిగజారును.

——(: o :)——

## పంచమరంగము — ప్రవరునిగృహము.

[ ప్ర॥ ప్రవరుఁడు. ]

ప్రవ—ఆహా! సిద్ధపుంగవుని పాదలేప మాహాత్మ్య మెంతని వర్ణింపవచ్చును? నిన్ననే గంగానదికిఁ బోయి స్నానముఁజేసి వచ్చితిని. అదే పాదలేపమున, నేఁడె హిమవత్పర్వతమునకుఁ బోయెదను. ఇప్పటినుండి యొక్కొక్క పుణ్యక్షేత్రమునకుఁ బోవుచు వచ్చెదను. ఈ పాదలేప మొక సంవత్సరమువఱకు నాకుఁజాలును. (పాదలేపముఁ బూసికొని మంత్రము నుచ్చరించుట నభినయించి) ఆచార్యా! హిమవంతమునకుఁ బోవలయును. (ఎగురును.) (ఆకాశమార్గమునందు పోవునప్పుడు ముందు యవనికపడును.)

[ ప్ర॥ నీలకంఠ — మృత్యుంజయుఁడు. ఇరువురు బ్రాహ్మణులు ]

నీల—మృత్యు— ( ఆశ్చర్యము నభినయించి) ఆహా! ఎంతబ్బురము. ఎంతాశ్చర్యము. చూచితివా. యెట్లాకాశమార్గమునఁ బోవుచున్నాఁడు.

నీల—మృత్యుంజయా! దీని చూచిన నాకు నిట్టి పాదలేపము లేకపోయెనే యను దుఃఖము వొడముచున్నది.

మృత్యు—నీలకంఠా! నాకు నట్లేయున్నది. చూచితివా! ఈ ప్రవరుఁడు మమ్మొక్కనాఁడైనఁ బాదలేపమిచ్చి పిలుచుకొని పోవుదునని చెప్పఁడుగదా.

నీల—పాదలేప మెంత కావలెనన్న నంతయున్నది లెమ్ము. అతఁడు పోయి చూడవలసిన చోటులన్నియు చూచిన పిదపఁ జూతము. మృత్యుంజయా! నీకు పాదలేపమిచ్చిన నీవు మొదట నెక్కడికి పోయెదు?

మృత్యు—నీలకంఠా! నిక్కము చెప్పుదునా. నాకు నా మేనమామ కూతురును చూడవలయునని మిక్కిలి యభిలాషమున్నది. ఒక్క యామమున నామె కొట్టిలోఁ బోయి పడుదును.

నీల— పాదలేపమునకు ఇదియా ఫలము?

మృత్యు—పోనీ! నీవేమి చేసెదవు.

నీల—నేనా? ఏమియా? చేసెదనా? నేనా— ఏమిచేసెదనా— నేనూ మఱి ఇంతె — ఇంకేమీలేదు. చెప్పెద వినుము- నేనూ —మఱి—నేనూ — మఱి.

మృత్యు=ఇంక జాలును లెమ్ము. నాకేల చెప్పవలయు. నీ మామకూతును వేరె= (ఈడ్చుకొని పోవును.)

(యవనిక నెత్తగా హిమవత్పర్వతమున ప్రవరుఁడు కనుపించును.)

ప్రవ= ఆహా! యీ పర్వత రాజము నెంతని వర్ణింపవచ్చును. ఈ యాకాశగంగ దీనియందె కదా యవతరించి భూలోకమునకు వచ్చెను. యజ్ఞగుండములో దహింపఁబడిన భవాని యియ్యెడగదా మరల నుద్భవించి పార్వతియాయెను.

సీ॥ పుడమివింతలుజూడ నడుగుఁగోరికఁగన్న
మిన్నేరుదిగుటకు మెట్టుదోరకెఁ
జన్నాన బన్నంబుఁ గన్నసతీదేవి
పుట్టినిల్వాసల పట్టుగాంచె
నోడొంటితో రాయ గొండలజగడంబు
రహిదీర్చియేలంగ రాజుగలిగె
తనయుఁడగుభర్త ననయమూరయు
హాటకాద్రికిదగినట్టు యల్లుఁడబ్బె॥

తే,గీ. గంగ మీరినచండాంశు నొడవలన
నుండవెలచినమంచుకు దంగగలిగె
చంద్రదక్షచిఁబోల్చు నీపర్వతేంద్రువలన
నెంచియీతనిమహిమ వర్ణించఁదరమె.

ఆహా! ఇది గంధర్వభూమి. సిద్ధమార్గమిదియే. అదె మానస సరోవరము బదరివనంబు నా ప్రసిద్ధిపొందిన చోటిల్లదెగదా?

మ॥ ఇది గంధర్వవిహారభూమి యదిగో కేసిద్ధమార్గంబుఁ
ల్లదె సౌగంధికపుష్పముల్గల కొలంకౌ బాయనే మానసం
బదెగా చైత్రరథంబదేగద కలాపాఖ్యామహాగ్రామమున్
మది కెక్కున్ బదరీవనంబదె జగన్మాన్యంబు చూపట్టెడిన్.

ఈ స్థలముననగదా. త్రిపథగయై నాకతటిని యుద్భవించుచున్నది. ఈచోటునగదా భగీరథుండు మహా తపము చేసినది ఇయ్యెడగదా భవాని గిరికన్యయై పతిని గాంచ తపమొనర్చినది. అక్కడనేఁగదా నిటలాక్షుని నిటలాక్షంబున నుద్భవించిన హవ్యవాహుండు మీనకేతను దహించినది.

సీ॥ నిశదవెన్నెలగుంపు జడగట్టసగరుమ
న్మనుమండు తపముఁ గైకొనినచోటు
జరఠకచ్ఛపకులేశ్వరు వెన్ను గానగా
జగతికిమిన్నేఱు డిగినచోటు
పుచ్చడీకతనంబుఁ బోదట్టి గిరికన్య
పతిఁ గోల్వనాయాసఁ బడినచోటు
వలరాచరాచవాఁడలి కాముకను వెచ్చఁ
గరగినయలకని కరపుచోటు ॥

తే.గీ. తపసియిల్లాండ్ర చెలువముల్దలఁచి తలఁచి
మున్నుమచ్చిచ్చువిగాలిఁ గొన్నచోటు
కనుపపులు వేల్పు పడవాయిఁగన్నచోటు
హర్షమునఁజూడనయ్యో నాకౌర నేఁడు.

ధరణీగోవును బిదుకనేర్చిన ఈధరణీధరుండు సమధిక తుషారసముపేతుండై జ్ఞాన వయోవృద్ధునింబోలెం జల్లనిం జూడ్కులు విలసిల్లుచున్నాఁడు. అనంత తేజోరాశియై యసమాన చండకరుడై నదీ సముద్రాదుల జలమును సయితము నింకఁజేయు వెట్టిదనముగల భానుఁడు సయితము మీయెడ నెంత చల్లదనము వహించియున్నాఁడు. ఇదియంతయు నీ మంచువలని ప్రభావము. ఉదయమై పది గడియలై యుండియు నిచండభానుఁడు హిమభానుఁడై యున్నాఁడు. ఆహా! ఇప్పుడిప్పుడుగదా వేడిమి తెలియుచున్నది. ఇప్పుడిప్పుడీ యినరశ్మిచే నందందు మంచుగరఁగి నీరుఁ గారుచున్నది. చల్లనివాఁడైన యీ నగరాజు కరుణారస ప్రవాహంబోయన్నట్టే మంచుటేఱులు ప్రవహించుచున్నవి. నా వెన్నసైత మించుకించుక వేడి గలుగుచున్నది. ఇంక నూరికిం బోయెదను. రేపు మఱల నిచ్చటికేతెంచి మఱియు నీ వినోదములం జూచెదంగాక. (మంత్రమనభినయించి) "ఆచార్యా! మా యరుణాస్పదపురమున నా యింటికి బోవలయు—. ఏమిది కదలక యున్నాను? మంత్రము నేమైన తప్పుగా పఠించితినా? మఱియొకసారి పఠించెదను. (పఠించుట నభినయించి) ఆచార్యా! మా యరుణాస్పదపురమున మా యింటికిం బోవలయు—. ఏమిది? నేఁడేటికిట్లాయెను. పాదలేప మహిమ యేమైనను కొఱవడెనా? (చూచి) అయ్యో! ఇంకెక్కడి పాదలేపము? కొంచమైనను, జ్ఞానము వహింపక యుంటినే. సూర్యరశ్మిచేఁ గలిగిన మంచు నీటితోఁ గలసి నా పాదలేపము ధౌతమై పోయెను. ఇంకేమి చేయుదును. ఏమిగతి. అకటా! నా యవివేకమేమందును. సిద్ధపుంగవుఁ డిచ్చిన పాదలేపము నా యింటిలో నొకకుప్పెలోనిడి దాచిపెట్టుకున్న వెంటనే తేఁగూడదా? ఇట్లౌనని నా కెట్లు తెలియవలయు. అయ్యో! ఈనాఁడు కాశి కురుక్షేత్రాది పట్టణస్థానములకైనఁ బోవక యీ యరణ్యస్థలమగు హిమవంతమునకు వచ్చితినే.

మ॥ అకలంకౌషధసత్వముం దెలియమాయాద్వారకావంతికా
శ్రీ కురుక్షేత్ర గయాప్రయాగముల నే సేవింప కుద్దండగం
డక వేదండ వరాహ వాహరిపు ఖడ్గవ్యాఘ్ర మిమ్మంచునొం
డకు రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజని తోన్మాదుల్గదా శ్రోత్రియుల్.

ఆహా! నా యాగమనము నిరీక్షించుచు నాపై నసమాన ప్రేమగలిగిన నా జననీ జనకులు నాకొఱకై యెంత దుఃఖింతురో—నా సతీమణి యెంత వగచుచుండునో—నా సహపాఠులు నాకొఱకెంత యెదురుచూతురో—అతిథ్యభ్యాగతులగతి యేమాయెనో—అగ్నిహోత్రతతి యెట్లుపోవునో.

సీ॥ ననునిమిషంబు గానక యున్న నారెల్ల
నరయుమజ్జనకు డెంతడలు నొకొ
యెపుడు సంధ్యల యందునీ కెల్లనీకన
నోర్మె మెదుఁదల్లియెంతో డలునొకొ
యనుకూలగతినాదు మనసులో వర్తించు
కులకాంతమదినెంత గుందనొకొ
గడతోడునీడవై క్రీడించుసచ్ఛాత్ర
లింతకునెంత చింతింతురొకొ ॥

తే,గీ. యతిథిసంతర్పణంబు లేమయ్యెనొకొ
యగ్ను లేమయ్యెనొకొ నిత్యంబులైన
కృత్యములబాపిదైవంబు కినుక నిట్లు
పొగవైచ నేమిన్నులు పడ్డచోట.

నే నింకేమి సేయుదును. ఎందైనను మా యూరిమార్గమైన విచారించెదఁగాక.

(అనుబంధము 10.)

(యవనిక దిగజారును.)

—.o()o:—

[షష్టమరంగము — హిమవత్ప్రాంత దేశము.]

[ప్ర॥ వరూధిని (వీణవాయించుచుండును)]

[ప్ర॥ తిలోత్తమ.]

తిలో—వరూధినీ! జూచితివా? నీ వీణాగానమున నీ చెంతనున్న తరువులు సయితము చిగిరించు చున్నవి. ఈ గానము నెంతని వర్ణింపవచ్చును.





(అనుబంధము II.)

వరూ—సఖీ! నీవేలంత ప్రశంసించెదవు.

తిలో—ప్రశంస గాదు. నిజమాడితిని. సంగీత కళానిధివగు నీకుఁ దగిన పురుషుఁడు. గాన విద్యానిపుణతా సమానుఁడగు వీరసేనుఁడు గాక—.

వరూ—సఖీ! ఎప్పుడేమాట చెప్పినను రెండవ మాటకు వీరసేనుని ప్రశంస తెచ్చెదవుగదా?

తిలో—వరూధినీ! పడుచుదనమున నీ వరయ నేరకున్న మా బోఁటి సఖులు హితముపదేశించుట నేరమా?

వరూ—నేరము కానీ కాకపోనీ. ఆవిషయముమాత్ర మింక నాకుఁ జెప్పకుము.

తిలో—ప్రాణసఖీ! నీకుఁ గోపము వలదు. వానికంటె నెక్కుడగువాని నీ వెవరిని వరింపఁగలవు? రూపమునఁ గొఱతయా? గానమునఁ దక్కువా? ప్రభావమునఁ జాలఁడా? వయసునఁ దగఁడా? వంశమున జన్మమున నలతియా? గంధర్వ వంశమున నలఘు మహిమగల యీ వీరసేనుఁడే మిటఁ దక్కువని తిరస్కరించెదవు?

వరూ—చెలియా! ఒకరి మానసము మఱియొకరెట్లు గ్రహింప నేర్తురు? లోకమున నందరు నొకటే రుచికలవారగుదురా? నీకు సురూపుఁడగువాఁడు నాకుఁ గాకుండవచ్చును. అన్ని లక్షణములుండినను మనసు గలుగకుండవచ్చును. ప్రేమయు మోహము మనసున జనించును. ఆమనసొక్కరి స్వాధీనమా? ఏ. హా రూపవంతులని యెన్నఁబడు పురుషులఁ గాదని యితరులకు హేయమనిపించు రూపముగల పురుషుల నెందఱు తరుణులు వరింపలేదు? మహిమోన్నత రూప విలాసముగల భార్యలమాని వికృత విగ్రహలగు వేశ్యాంగనల నెందఱు పురుషులు మెచ్చలేదు? అదియొకరి యధీనము గాదు. నీకు హీన రూపుఁడని తోఁచువాఁడు నా కతి లోక మీనకేతుఁడని తోఁపవచ్చుఁగదా? అదేల—.

తిలో—ఇంకఁ జాలును లేవే నీ శాస్త్ర ప్రసంగము! మనసట! అధీనమఁట! మనసు గడ్డిమేసినను గన్ను లెక్కడఁ బోయినవి? చూపఱకి నొక్కటియే కదా? ఒకరికి నల్లఁగా నున్నది మఱియొకరికిఁ దెల్లగాఁ దోచునా? దృష్టిబొమ్మ యెవరికైన మన్మథుఁడగునా? బుద్ధిఁ దెలియని మనసు కలుగునా?

వరూ—చెలియా! నీతో నాకుఁ బ్రసంగమేల? నా కిష్టము లేనప్పుడు నీవేల చెప్పెదవు?

## ప్రథమాంకము — షష్ఠమరంగము.

తిలో=ఇష్టము లేకేట్లుపోవును? తెలివిలేమిచే నిష్టము లేనప్పుడు చక్కఁదిద్దకున్న నా సఖిత్వము వలనఁ బ్రయోజనమేమి? నీ చెలిమివలనఁ జెప్పెదను. నీవా వీరసేనుని—.

వరూ=రమణీ! ఆ విషయము మాత్రము నాకుఁ జెప్పకుము. నీకు నా యానగలదు.

తిలో=ఆహా! హితముపదేశింప వచ్చిన నాకు నాన పెట్టెదవా? చెలీ! నా సఖిత్వము నీకుఁ గావలెనన్న నా మాటవినుము. కాకున్న నీ చెలిమివలన నేమి ప్రయోజనము?

వరూ=సఖియా! ఇట్టి నిష్ఠురోక్తు లేటికాడెదవే?

(అనుబంధము 12)

ఇంత మనసురాని బలవంతము దగునా?

తిలో=అంతయు నీ క్షేమము కొఱకేగదా? ఇంక నా కొక కడమాట చెప్పుము.

వరూ=(యోచించును) (తిలోత్తమ, వరూధినిని బిలుచుకొనిపోవును.)

[ ప్ర॥ (దూరమున) వీరసేనుఁడు — శతానందుఁడు. ]

వీర=ఆహా! శతానందా! ఇది మంచి సమయముగానున్నది. తిలోత్తమ సయితము సమీపమున నున్నది. ఎట్లయినను బోయి దాని చరణములపైఁ బడియెదను.

శతా=నీ శిరసు గట్టిగానున్నదా?

వీర=ఏల?

శతా=నీవే యోచింపుము.

వీర=అయ్యో! పాదతాడనమునకు భయపడెదవా? లేమావిచిగుళ్ళవలెఁ గోమలాతికోమలములగు నీ లేమపాదములు తలయందు ధరించితినా ధవళకిరణుఁడగు కుముదబాంధవునిఁ దలయందు ధరించిన భవానీనాథునివలె నుల్లసిల్లనా?

శతా=భవానీ నాథుఁడవో? ఇట్లెంచుకున్నావు?

వీర=ఎట్లున్నాను?

శతా=(వ్రేలు నాడించుచు) శల్యమాత్రా వశిష్టుడవై చిక్కి సగమైయున్నావు.

వీర=శతానందా! నిక్కమాడితివి. చిక్కి సగమై యున్నవాఁడే కదా భవానీ నాథుఁడు? అతని యర్ధాంగము పార్వతిచే ననుభూతముగదా?

కం॥ నీమాట నిక్కమౌగద
యీమానితవాక్కు కల్ల యేలాగగునా
హైమవతీసతినాథుని
సామేనుభవాని గాఁగసగమాయెనుగా.

శతా=ఆహా! మంచి సామ్యము దొరకెనేకదా? ఆ భవానీశుఁడు గిరికన్యఁగలిగి యర్ధాంగుఁడాయెను. నీవో అర్ధాంగుఁడవుగావు. పాదాంగుఁడవైనను నీకీ గిరికన్య లభించునట్లు లేదు. అప్పుడు—

వీర=అప్పుడు భవానీశుఁడనె.

శతా—అది యెట్లు?

వీర=వరూధిని లభింపకున్న అతనివలెనే భస్మధరుండనై—

శతా=కాదు. కాదు. మఱచితివి. నతనివలెనే గౌరి దొరకకున్న గంగను జూచుకొందువు కాఁబోలు.

వీర=గంగ నెట్లు చూచుకో వలయు?

శతా=ఏమీ! ఒక పెద్ద రాయిమాత్రమున్న గంగను జూచుకో కూడదా?

[పునః ప్ర॥ తిలోత్తమ — వరూధిని.]

తిలో=ఏమి వరూధినీ! ఇట్లు యోచించుచున్నావు?

వరూ=చెలియా! నాకు రెండు దినములుమాత్ర మవకాశమిమ్ము.

తిలో=ఇన్ని దినములైనది. రెండుదినములకా వచ్చినది? నీవు యోచింతునని చెప్పినదే చాలును. ఇది యంతయు వీరసేనునితో జెప్పి రెండుదినము లెట్లయిన ప్రాణములు భరించునట్లు చేయుదును. (పోవఁ బోవ)

వరూ — అతివా! ఆ వీరసేనునితో నేమియుఁ జెప్పకుము.

తిలో — అట్లనే కానిమ్ము. (నిష్క్రమించి)

వరూ — అకటా! ఇట్టి దుఃఖ మెందైనఁ గలదా. ప్రాణసఖియయి యుండు తిలోత్తమ [illegible] బలవంత పెట్టుచున్నదే. ఆ వీరసేనుఁ డెట్టి మన్మథుఁడైనను వాని [illegible] మదు. ఇంకఁ దిలోత్తమ నా చెలిమి వలదను చున్నదే. ఈ సంకటము [illegible]

(అనుబంధము 13.)

శతా — వీరసేనా! ఇది యింక నీకు మంచిసమయము.

వీర — అయ్యో శతానందా! పోవను ధైర్యము చాలదు.

లోపల ధ్వని "దారిని జూపెదరే" అని

వీర — శతానందా! అక్కడ నెవరో బ్రాహ్మణుఁడు వచ్చుచున్నటున్నాఁడు.

[ప్ర॥ ప్రవరుఁడు.]

(అనుబంధము 14.)

(ఇటు పాడుచు ప్రవరుఁ డొక ప్రక్కన వచ్చి మఱియొక ప్రక్కన వెడలి పోవును. [illegible] ధిని యాశ్చర్యమునను, వీరసేన శతానందు లభిలాషమునను వాని జూతురు.)

వరూ — అవురా! ఏమీ యద్భుత రూపము? ఇట్టి యాకార స్ఫురణము నెక్కడనైనఁ [illegible] టిమే? దేవతలలో జయంతనలకూబరాదులఁ జూడమా? [illegible] గంటిమే? ఆహా! ఈతఁడు మానవుఁడు. బ్రాహ్మణుఁడు. మానవులలో నిట్టి[illegible]

(అనుబంధము 15.)

ఈ మహామహుఁ డనవరతాకాశగమనమున నాయాసము వహించి విశ్రాంతికై [illegible] తలంబున కవతరించిన చంద్రుఁడుగా నుండనోపు. అట్లయినఁ గళంక రహితుఁడుగా [illegible] డుగదా? అటుగాదీ తేజోవంతుఁడు విరహిజనాళిపై జైత్రయాత్ర వెడలుట [illegible]

పాంథులు దన్ను సంగహీనుఁడని దూషించుటఁ దాళుకొనలేక యంగసౌష్ఠవము వహించు ప్రేమబూని తపంబుకొఱకీ హిమవంతంబునకు వచ్చిన పంచబాణుఁడుగా నుండెడు. ఆహా! ఏతపమును సలుపుటకు ముందే యిట్టి మహిమాతీతమయిన సురూపము వానికబ్బనే? ఆహా! యీ పురుషోత్తముఁ డాదరింపఁ గనిన తరుణీమణి లక్ష్మీవిలాసము నెంతని వర్ణింపవచ్చును? ఆహా! మదనుఁడు నన్నుండ నియ్యఁడుగదా? అతఁ డిక్కడికే వచ్చుచున్నట్లున్నది. ఎవరో సంగతులన్నియు నడిగి హెచ్చరింతును. అంతవఱకు నెట్లు తాళుగును. తిలోత్తమ యింతవఱకు నాతో వీరసేనునికంటెఁ జక్కనివాఁ డెవ్వఁడని చెప్పుచు వచ్చెను. అది యీ మనోహరునిఁ జూచియున్నఁగదా? ఈ కందర్ప రూపుని కాలిగోరునకైన వీరసేనుఁ డీడగునా?

(నిష్క్రి.)

శతా—వీరసేనా! నీ ప్రతివాది.

వీర—మిత్రమా! అప్పటినుండి యీ వరూధిని యతనినే చూచెను.

శతా—చూచెనా? చూచెను—పూచెను—కాఁచెను—.ఇంక లేచెను.

వీర—ఏమీ!

శతా— నా కట్లు తోఁచెను.

వీర— ఇంకనేమి చేయవచ్చును?

శతా—సౌఖ్యముగా నిద్రపోవచ్చును.

వీర—అయ్యో! శతానందా—

శతా—అయ్యో! వీరసేనా—

వీర—ఏమి?

శతా—ఇంకనేమి?

(నిష్క్రమించి ప్రక్కకుఁబోయి యుందురు.)

[వెనుక యవనిక నెత్త పర్వత దేశమున — వరూధిని యుండును.]

పునః ప్ర॥ ప్రవరుఁడు,

(అనుబంధము 14 A.)

స్వ॥ ఆహా! నాదుఃఖమున కింక నేమందును? నిర్మానుష్యమైన యీ పర్వతారణ్యమునఁ జిక్కి యున్నానుగదా? తల్లిదండ్రి మొదలైనవారు—ఏమిది? ఏదోసువాసన వచ్చుచున్నది. పోయివిచారింతును. (ముందరికి వచ్చి) ఈస్థలమున నెవ్వరో యొకవనిత యున్నది. ఈవనభూమిలో నిర్భీతిగా నిట్లుండుటకుఁ గారణమేమి? ॥ప్ర॥ కాంతామణి! నే నార్యావర్త దేశమున వరుణానదీ తీరమున నరుణాస్పద పురమున నున్న ప్రవరుఁడను బ్రాహ్మణుఁడను. అవివేకినై యొకానొక సిద్ధుఁడొసఁగిన పాదలేప ప్రభావమున నీ తుషారాద్రికి వచ్చి యరుణాంశు కిరణ ద్రవీభూత హిమరసాసారంబునఁ బాదలేపము చెడిపోవఁజిక్కి యూరు చేరుమార్గ మరయకున్నాను.

ఉ॥ ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ యొంటిఁజరించెదోటలే
కివ్వనభూమిలోన వినుమేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవతప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచితి నూరుచేరనిం
కెవ్విధిఁబోదుఁ జూపఁగదవే తెరువేదిశుభంబునీకగున్॥

వరూ॥ బ్రాహ్మణా! ఏమి జాణతనము సేయుచున్నావు? నీవు వచ్చిన యూరుత్రోవ నీకుఁ దెలియకుండునే? ఈ నెపమున మాటలాడించు చున్నావుగాక యంతింత కన్నులున్నవే?

ఉ॥ ఇంతలుకన్నులుండ దెరు వెవ్వరివేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందునున్న జవరాండ్రనెపంబిడి పల్కరించులా
గింతియెకాక నీవెఱుఁగవే మునువచ్చిన త్రోవఁబోవని
ట్లింతభయంబులేక కనుఁగనెల్లిదమైతిమె మాట లేటికిన్॥

ప్రవ — అతివా! నీవు కోపము చేయకుము. క్షమింపుము. పోయివచ్చెద

వరూ — బ్రాహ్మణోత్తమా! ఊరకంటిఁగాక నాకుఁ గోపమా? పోదువుగాని కూర్చుండుము.

ప్రవ — తరుణీ! దిక్కు తెలియక యున్నాను. నాకు నెమ్మది గలుగఁ జాలదు. కూర్చొనఁజాలను.

వరూ — భూసురవరా! ఇంతాతురమేల. పోదువుగాని నా సంగతి నింత వినిపొమ్ము.

సీ॥ చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువతోఁ బుట్టుమాకు
రహిఁబుట్టజంత్ర గాత్రములరాల్గరగించు
విమలగాంధర్వంబు విద్యమాకుఁ
ననవిల్తుశాస్త్రంబు మినుకులావర్తించు
పనివెన్నతోడఁబెట్టి నదిమాకు
హయమేధరాజసూయములు నాఁబేర్పడ్డ
సవనతంత్రంబు లుంకువలుమాకుఁ

తే,గీ. గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టగమి రచ్చపట్టుమాకుఁ
బద్మసంభవవైకుంఠ భర్గసభలు
సాముగరడీలుమాకు గోత్రామరేంద్ర॥

ధరణీసురా! నేను దేవవేశ్యను. వరూధిని యనుదానను. నిక్కము దాఁపనేటికి? నినుఁ జూచి నప్పటినుండియు నా మనము నా యాధీనము కాకయున్నది. నేను చుట్టుమాటలే లాడవలయును? నా సంకల్పసిద్ధి నెఱవేర్పఁ గోరెదను.

ప్రవ — హరి — హరి! (అని చెవులు మూసుకొని) రమణీ! ఇట్టి మాటలాడి నన్ను పాపమునకేల గుఱిగాఁ జేసెదవు?

వరూ—నీకు పాప మెట్లుగలుగును?

ప్రవ—కలనైనఁ బరవనితాసంపర్క మెఱుఁగని నాకు—

వరూ—నీవు పరవనితా సంపర్కమునకు భయ పడకుము. నేను వెలయాలఁగాని, మగనా లఁగాను.

ప్రవ—అయ్యో! ఇట్టిది యొకం గలుగునా? వెలయాలైన నంతకంటెఁ బాపముగలదా.

వరూ—విప్రపుంగవా! ఇట్టి ఛాందసము లేకున్న నీ వైదికత కే లోపము. సశరీరస్వర్గసుఖ మిప్పుడులభింపనుండ వలదందువేఁ?

ప్రవ—రమణీ! మీప్రభావము లనంతములు మా యూరిలో దేవార్చనాదు లన్నియు నేను బోవ కున్న నిలిచిపోవుచున్నవి. ఎట్లయినను దయచేసి త్రోవ తెలిసియున్నఁ జూపుము. నీమాటలు విడువుము.

ఉ॥ ప్రేలిమియుక్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కెభుక్తికిన్
వేళయతిక్రమించె జననీజనకుల్ గడువృద్ధులాకటన్
సోలుచుచింతతో నెదురుచూచుచు నుండుదు రాహితాగ్ని నే
తూలుసమస్తధర్మములు తొయ్యలి నేఁ డిలుసేరకుండినన్ ॥

వరూ—

ఉ॥ ఎక్కడియూరు కాల్నిలువకింటికిఁ బోవలెనంచు నెంచెదీ
వక్కటమీకుటీర నిలయంబులకున్ సరిరాక పోయె నే
యిక్కడిరత్నకందరము లిక్కడిచందన నందనోత్కరం
బిక్కడిగాంగసైకతము లిక్కడియాల వలీనికుంజముల్ ॥

నీ వాహితాగ్ని వని యడలెదవు గదా? యజ్ఞాదుల నొనర్చుటంతయు రంభాదులగు మము బోట్లననుభవించుటకేకదా? అది చచ్చి శరీరము బాసినపిదప లభించునట? ఇప్పుడు నీకో—

ప్రవ—వనజాక్షీ! నీవు చెప్పినది కామ్యార్థమైచేయు వారివిచారము. వ్రత నిష్ఠత్వమున నిత్య యాత్రనడుపుచు విరాగగుణముఁ బూనయున్న వారికిఁ గాముకవిచారము చెల్లునా?

వరూ—అయ్యో! పై గాలిసోకిన మాత్రమున వెన్నవలె మనసు గరఁగించు రమణీ మణిని రతిఁదేల్చు మహాభాగ్య మెన్నిదినములకు లభింపనలయు. అందునకు వెన్నెలవలె, గూబకుఁ బగటివలె, నీ కన్నులకు నా సౌందర్యము వెలతియై తోఁచెఁగా? "ఆనందో బ్రహ్మ" యను వేదోక్త మింత విచారింప లేవు గా?

ప్రవ—ఆహా! మంచి శాస్త్రార్థము చెప్పితివి.? ఆనందో బ్రహ్మ యను వేదసూక్తికిట్లనా పరిణతి? కాముకులకుఁ దగినయర్థము వివరించు నీ పాండిత్యము మెచ్చితి?

మ॥ తరుణీ ఱేఁపు మాపుహవ్యములచేతిం దృప్తుఁడౌనహ్ని స
త్కరుణాదృష్టి నొసంగుసౌఖ్యము లెఱుంగ శక్యమే నీకు నా
కరణుల్దర్భలునగ్నులుం బ్రియములై నట్లన్య ముల్గావొడ
ల్దిరమే చెప్పకు మిట్టితుచ్ఛసుఖము ల్మీసాలపై తేనియల్॥

వరూ—బ్రాహ్మణోత్తమా! నీ మనసు రాఁగోరి యింత తడసితి. ఇంక మఱేఁదు ననుఁ దాళ నియ్యఁడు.

ప్రవ—మఱియు నీ మతము విడువవే. త్రికరణ శుద్ధిగా నే నింటునకు సమ్మతింపఁ జాలను. అనుగ్రహించి నా యూరు దారిఁ జూపుము. ఈ పాపము నాకువలదు.

వరూ—నీ యూరుసీమ నను వసింపనీక, నీ యూరు సీమకై పోయెదవా? సంతతకంతుశరసంతాపమున వంతఁ జెందించెదవా? మా యప్సరస్తరుణులలో నొక సమయము గలదు. ధీర కృత్యమైన యుద్ధమరణము నొందినవారికి, యజ్ఞాదుల నొనర్చినవారికిఁదప్ప మేము చిక్కము. మేమై మోహించితిమా? విడువము. కావున విరసత్వముమాని సరసభాషణముల నా సరసఁ జేరుమా? ఇది పాపమని యేలందువు. ఇట్టి పాపమనునది వ్యాస విశ్వామిత్రాదులు చేయరా?

( అనుబంధము 16 )

ప్రవ—తరుణి! నీవు వేశ్యవయిన మాత్రమున నే సుజనకర్ణకంటకములగు భాషణము లాడవచ్చునా?

వరూ—మనోరమణా! నీ వేమన్నను నిను విడువఁజాలను. నీ పాదములాన విడువఁ జాలను. (అని పాదము లంటఁబోవును.)

[ప్ర॥ వీరసేనుఁడు — శతానందుఁడు.]

ప్రవ—అయ్యో! నా కేమియవస్థ వచ్చెను. అమ్మా! నా మాటల నాదరింపుము— (యోచించును.

వీర—శతానందా! చూచితివా. ఈ రమణి యా ధరణీసురుని చరణము లిప్పు డంటుచున్నది. దీని చరణములంటి వేఁడుమనిన సిద్ధముగా నున్నాఁడఁగదా?

శతా—అయిన నాకొకటి తోఁచుచున్నది. వాని చరణముల నిది పట్టుకొనును. నీవు నిప్పుడే దాని చరణముల నంటుము. చూడను బాగుగనుండును.

వీర—ఆహా! నీ నవ్వులాట కిదే సమయమా?

ప్రవ—రమణీ! నిను వేఁడుకొందును నా చింత విడువుము. (పోవఁ బోవును.)

వరూ—ధరణీసురా! నీ విట్లుచేసిన నా యత్నము లేదు. (అని చేయి పట్టుకొనును)

ప్రవ—(విడిపించుకొని) అమ్మా! ఇంత సాహసము నీకుఁ జెల్లునా? నన్ను నీ వూరక తప్పఁ దలంచితివి. (పోవును.)

వరూ—(పోయి ప్రవరుని యుత్తరీయము పట్టుకొనివచ్చి) క్షోణీనిర్జరేంద్రా! ఇదిగో మదనుఁడు నను దరమి తరమి వచ్చుచున్నాఁడు. వానితో నివాహవము చేయకుండుట తగునా?

(అనుబంధము 17)

ప్రవ—అతివా! నీ వబలవైనందున నొండనఁజాలక యింతవఱకుఁ దాళితిని (కోపమున) ఇక నన్ను విడువుము.

వరూ—విడువక కట్టివేయుదునా? నా బాహువల్లరులచే నింత సూక్ష్మము నాశ్లేషముఖమున బంధితుఁగాక (అని ఆలింగనము చేయఁబోవును.)

(ప్రవ—హా—హర! అని క్రిందఁ ద్రోయును.)

వీర—అయ్యో! వీని పుణ్యము నాకు లేకున్నదే?

శతా—వాని పుణ్యములేక పోయినను దీని పుణ్యము నీకుఁ గలిగియున్నదిగదా?

వీర—దీని పుణ్యమేమి?

శతా—ఇదిగో చూడుము. ఎట్లు త్రోఁపు వడియున్నదో?

(అనుబంధము 18.)

వరూ—హా కఠినాత్మా! యువతీ జనములపై నీ విట్టి క్రూరత్వము చూపవలయునా? సర్వశాస్త్రములు సర్వాగమములు నేర్చిన చదువు చట్టుబండలు నీ కిక్కడికిఁ గడవెళ్ళెనా? అనన్యథా గతికనై కావుమని వేడుచున్న దీనయగు నబలను దయావిహీనుఁడవై యిట్లు చేయవచ్చునా? అయ్యో! నీవు త్రోయఁగా నిచ్చట నీ నఖాగ్రముసోకి నెత్తురెట్లు కారుచున్నది చూడుము. ఇది పుణ్యకార్యము కాఁబోలు. ఇట్టి దుర్వృత్తము నీకుఁ దగునా? చదివిన మూర్ఖుఁడవే నిన్నేమి చేయవచ్చును?

ప్రవ—ఆహా! నా కింకేమిగతి. అమ్మా! నన్నుఁ గినియకుము. నా పుణ్య పాపములు దేవుఁడె ఎఱుఁగును. (పోవును)

వీర—శతానందా! నే నిప్పుడపోయి యీ బ్రాహ్మణునిఁ గ్రిందబడవైతునా?

శతా—ఆ బ్రాహ్మణునిఁ గ్రిందఁబడవైచినందున ఫలమేమి?

వరూ—(నల్దిక్కులుచూచి) ఆహా! నా దౌర్భాగ్యమున కేదిమేర. ఈభూసురుండించుకైన దయాగుణ భూసురుండ గాక నన్నుఁ గ్రూరాసురుండగు మదనుని పాలుచేసెనే? త్రోపువడినను, పరాభవమొందినను, దుఃఖింపనుఁగాని కన్నులార నా మహామహుని సుందరరూపము జూడ లేక యున్నానుగదా?

(అనుబంధము 19.)

అయ్యో! నేనేమి చేయుదును. ఈ వియోగసాగరమేగతికడజేరుదును. అకటా! ఇట్టి ఘాందసుం డెంద్రైన వినఁబడెనే? ప్రాప్తించిన మనోహ రాస్వర స్తరుణిని కాదని మీఱిపోయెఁ గదా? కటకటా! గంధర్వాగ్రేసరుఁడగు వీరసేనుని నెంత వరింపుమన్నను వలదనుదాన నొక మానవ భూసురునిచే నిటు తిరస్కృతనైతిఁగా—హా! హా! (అని పడును.)

వీర—అయ్యో! శతానందా! ఎట్లాయినను మనముపోయి సేదదీర్తము. (సమీపించి, అంటఁబోయి) ఇట్టి సమయమునను నీ రమణిని ముట్ట బుద్ధి పుట్టదుగదా? నన్నింత చెంతకు రాకుండఁజేసి యున్నదే? (గాలివిసరును)

(అనుబంధము 20.)

[ ప్ర॥ తిలోత్తమ ]

తిలో—వీరసేనా! ఏమది? (వరూధిని వైపుఁజూచి) ఆహా! యిదియేమి?

వీర—తిలోత్తమా! యీ తరుణి మూర్ఛిల్లియున్నది.

తిలో—వరూధినీ! వరూధినీ—ఆహా! వీరసేనా! ఇట్టి దుష్కృత్యము నీకుఁ దగునా?

వీర—తిలోత్తమా! ఇందుకు నేనుఁ గారణముగాదు.

తిలో—దాఁచెదవా? ఇంకఁజాలు నిచ్చోటు విడి చిపొమ్ము.

వీర—తిలోత్తమా! నిశ్చయముగాఁ జెప్పెద. నీ దారిఁబోవుచు నొక బ్రాహ్మణుఁడు.—

తిలో—(కోపమున) ఇంకఁ జాలునుపొమ్ము బ్రాహ్మణుఁడైనది, క్షత్రియుఁడైనది. ఇంత యవివేకి వికాకున్న నిన్నీ వరూధిని వలదునా?

వీర—దైవమా!

తిలో—దైవమా! భూతమా! ఇంకఁబొమ్ము.

శతా—వీరసేనా! ఇంకరమ్ము. అయినది.

(వీరసేనుఁడు నిష్క్రమించును శతా॥ ముఖము గొట్టుకొనుచు నిష్క్ర.)

తిలో—అకటా! వరూధినీ! ఈ బాధకు నేనే కారణము. పట్టినపట్టు వదలక నీతో నతి నిష్ఠురోక్తులాడితిని. తాళఁగూడని సంతాపము నించుకైన నరయనేరకున్న యీ యవివేకి వీరసేనుని వరింపుమని బాధించితిని ఈ యజ్ఞానుఁడే మాగడముచేసెనో యిట్లు యిట్లు మూర్ఛిల్లియున్నావు. వరూధినీ! ఆ వీరసేనుని వివాహమాడుమని యింక నిన్ను బలవంత పెట్టనులెమ్ము ఏల యిట్లు మాటలాడకున్నావు. అకటా!

(అనుబంధము 21.)

(వరూధిని యదరిపడును.)

ఆహా! ఏమిట్లదరిపడుచున్నది? మరల నదరెనే. ఈ మందానిల ప్రసరణంబున నూరక యులుకుచున్నది. అట్లైయిన నిర్భరమోహ ప్రాదుర్భావమునఁగదా యీ పాటుకలిగి యుండవలయు? మోహమునకుఁ గారణమేమి? అయిన వీరసేనుఁడీ మూర్ఛకుఁ గారణము కాఁడా? అయ్యో! మఱియు మఱియు నులుకుచున్నది. ఆహా! మలయానిలా! నీదాడికొంత యుపశమింపుము. ఈ చిన్నికన్నెపై నీకీ చలముదగునా?

(అనుబంధము 22).

ఈ తరుణి కింక కొంత శైత్యోపచారములైన చేయుదును. శశిరేఖా!

[ ప్ర॥ శశిరేఖా ]

శశి—ఏమి తిలోత్తమా! పిలిచితివి.

తిలో—శశిరేఖా! చూడవే, మన వరూధిని యే కారణముననో మూర్ఛిల్లియున్నది.

శశి—అయ్యో! అట్లనా? ఇంక నేమిచేయవలయునే?

తిలో—శశిరేఖా! మన మిరువురము మెల్లగా నీ తరుణినిఁ బూపాన్పుపై పరుండఁబెట్టి శైత్యోపచారములు చేయుదము.

(ఇద్దరు వరూధినిఁ బిలుచుకొని పోదురు.)

పునః ప్ర॰ ప్రవరుఁడు.

ప్రవ—అయ్యో! నే నేకర్మము నెఱుఁగక దారి వేఁడవచ్చినందుకు నన్నీయబల యింత ప్రబలయై యిట్లు చేయవచ్చునే? నే నింకేవిధమున నూరు చేరుగు? ఆహా! వెలయాండ్రఁ తలుగనలుగా నుందురే? నా కింకెవ్వరు శరణము? నిరంతరము నమ్మియుండిన భగవానుఁడగు యజ్ఞేశ్వరుఁడే నా కింక దిక్కు కాఁగలఁడు. హా! స్వాహావల్లభా! చతుశ్శృంగా! త్రిపాదా! ద్విశిరస్క సప్తహస్తా! అనలా — కృపీటసంభవా! నిన్నే నమ్మి యుండునది నిజమయేనా, పరదారాధనపరాఙ్ముఖుండనై యుండునదే నిజమాయెనా? ఈ సాయంకాలము కాకముందే నన్ను నా యిల్లు చేర్పుమా —

ఉ॥ దానజపాగ్నిహోత్ర పరతంత్రుఁడ నేని భవత్పదాంబుజ।
ధ్యానరతుండ నేనిఁ బరదారధనాపులఁ గోర నేనిన।
స్నానముఁ వోడ నన్ను సదనంబుననిల్పుమి నుంత పశ్చిమాం।
భోనిధిలోనఁ గ్రుంకకయె మున్న గయంబున హవ్యవాహనా॥

(అగ్ని నుద్భవించి ప్రవరుని నాకాశమార్గమున కెత్తుకొనిపోవును. ముందటి యవనికపడును.)

[ప్ర॥ వీరసేనుఁడు — శతానందుఁడు.]

శతా—వీరసేనా! బాగయినదిగదా నీకు?

వీర—ఆహా! శతానందా! చూచితివా? మూర్ఛిల్లిన సతిని సేదదీర్పఁ బోవఁగా నీ బెడదవచ్చెను. నా మాటయిన పూర్తి వినక తిలోత్తమ నేనేమో చేసినట్టెంచి నన్నూరక దూరెఁగదా?

శతా—పిడుగుపడినవాని కొఱవితోఁ బొడిచి నట్లాయెఁగదా?

వీర—ఆహా! ఇంకఁ జాలును పోవుదమురమ్ము. శతానందా! నెమిది? యేవఁడో యొక పురుషుని నగ్ని మోసికొని పోవుచున్నది?

శతా—ఆయ్యో! అతఁడు నీ ప్రతివాదియే —

వీర—ఔను — ఏమాశ్చర్యమిది? పోవుదమురమ్ము (నిష్క్రమింతురు.)

ప్రథమాఙ్కము సమాప్తము.

# — వ రూ ధి నీ నా ట క ము. —

## ద్వితీయాంకము — ప్రథమరంగము.

హిమవత్ప్రాంతభూమి.

[ ప్ర॥ శతానందుఁడు — వీర సేనుఁడు. ]

శతా—వీరసేనా! నీ యుపాయ మాదరణీయముగాదు. నీ వొకవేళ ప్రవరుని రూపమేధరించితివి. ధ్వనికేమి చేయుదువు.

వీర—ఇంతయేయా? నా శాంబరీమహిమ నీ వెఱుగవే?

క॥ ఇంచుకయైనను భేదము।
నెంచఁగ రాకుండరూప మేల్పడుధ్వనియుఁ।
వంచన సేయుంగడువివ।
రించెదు గానాదు శాంబ రీమహిమంబుఁ॥

అన్ని విషయములందును భేదములేనియట్లుండ గలను

శతా—అది సరేకాని, రూపాంతరము మాయచే ధరించినవారికి వరణమునందును, నిద్రయందును రతికాలమందును. స్వరూపము గలుగునని యున్నదిగదా? దానికెట్లు చేసెదవు.

వీర—దానికేదైన నుపాయము చేయఁగలను. లెమ్ము ఆ కొండనొద్దనున్న కొన్ని దోషధులు సంగ్రహించుకొని వత్తును. (నిష్క్రి.)

శతా—అయ్యో! వీనికేమి పిచ్చిపట్టియున్నది? ఎంత చెప్పినను వరూధినిపై చింత మానఁడు. అది యెంత వీని మోమునకు మసి పూసినను వీనికిష్టమే. దానికేమి సంతోషమో, వీని గాదని మఱియొకని వరించినది. వాఁడెట్టివాఁడు. ఆహా! ఒక బడుగువైదికుఁడు వానికి ప్రొద్దునలేచిన తీర్థయాత్ర. కండ్లుతెఱచిన నగ్నిహోత్రము. మాటలాడిన నతిథులు మంచమెక్కిన నాచా

రము. ఇట్టివాని కది మరుహైనది. ఇది చూచియు వీఁడు దానిని మానఁడు. తన వెఱ్ఱితన కానందముగదా ? వీనితోఁగూడ నవస్థపడవలసినది. నాకు వచ్చినది—పండుకొనెనా సరి ప్రొద్దప్పుడు వరూధినియని కలువరించుచున్నాఁడు. పండుకొనువఱకు సెందుకు? ఒక్కనాఁడు పగలు మేలుకొనియుండియే నాకాళ్ళపైఁ బడును. ఏమిచేయ వలయును?

మిత్రమా! ఈ ఫలములు భుజించెదవా ? ప్రత్యుత్తరము—వరూధిని—చెలికాడా! ఆసరోవ రము—చూచిపత్తము—వరూధిని— మిత్రమా — ఏమంటివి ? వరూధిని—నీకు పిచ్చి పట్టి యున్నది—వరూధిని. నీకు బుద్ధిలేదు — వరూధిని. ఓరీ యవివేకి — వరూధిని. వరూధిని ఏకవరూధిని. ఆ వరూధిని వీనికిఁ బట్టియున్నది. ఇప్పుఁడు ప్రవరునివేషము వేసుకొనుచు న్నాఁడట? బాగుగ పాదతాడనములు పడును. కానీ! ఏమిది? ఇంతసేపయినను ఇంకను వాఁడు రాలేదు. నేనేపోయి వెదకుదును

( అనుబంధము 23 )

(నిష్క్రు.)

[ ద్వితీయరంగము — అదే హిమవత్ప్రాంతభూమి. ]

(వీరసేనుఁడు మాయాప్రవర వేషమున జపము చేయుచు కూర్చొనియున్నాఁడు.)

ప్ర॥ శతానందుఁడు.

శతా—అయ్యో! అయ్యో! నా మిత్రుఁ డెందెందు వెదకినను జిక్కకున్నాఁడే. నేనేమి సేయు దును. అయ్యో! ఎంతా గడమాయెను ? వరూధినిని వలదు వలదని నే నూరక యుపదేశము చేయుచుండినది తాళుకొనలేక నన్నేడబాసి పోయియుండును. లేకా వరూధినీ విరహభా రము సహింపక యేమయినాఁడో అయ్యో! చిన్ననాఁటినుండి స్నేహముననున్న పరమమి త్రుఁడే పోయెనే. నేనేమి చేయుదును? నా కింకేటి బ్రదుకు? (వీరసేనిను వైపుఁజూచి) ఆహా! యీ బ్రాహ్మణుఁ డిక్క సేయున్నాఁడు. వీనివలనఁగదా నా పరమమిత్రునికింతాపదగలి గెను. వీని ముఖమయినను జూడను—అయ్యో ? వీనిపైఁ గోపము గలిగినమాత్రమున నా కేమిఫలము ? వీరసేను పొలకువ యేమయినను జెప్పునేమో విచారింతును—అయ్యా ! ఎఱ్ఱనివాఁడు. విశాలవక్షస్థలము వాఁడు. దీర్ఘనేత్రములవాఁడు ఆజానులంబ బాహువులవాఁడు. నా మిత్రుని నెందైనఁ జూచితివే?

మాయాప్రవరుఁడు—గంధర్వోత్తమా! నీవు వీరసేన గంధర్వ రాజునుగదా యరయుచుండుట?

శతా=అవును. నీకుఁ బేరుసయితము తెలియునే ఎట్లు తెలిసెను?

మాయాప్ర=వాఁడే యిచ్చటికివచ్చి చెప్పుకొనెను.

శతా=వచ్చి యెక్కడికి పోయెను?

మాయాప్ర — ఎక్కడికిఁబోయిన చింత నీ కేటికి?

శతా=మహాత్మా! నీకు నమస్కరించెదు. అతఁడేమాయెను చెప్పుమా?

మాయాప్ర=అతఁడేమి కారణమో తెలియదు. నన్నుఁజూచి నీ పుణ్యము నాకు లేకపోయె నని చెప్పెను. కొంతసేపుండి యానలకుఁబోయి యా యున్నత శైల శిఖరము నెక్కి ఆ ప్రక్కకు దుమికి చరుపాత మొనర్చెను.

శతా=(ఎదగొట్టుకొని) అయ్యో! అయ్యో!

(అనుబంధము 24)

మాయాప్ర=(శతానందునిఁ గౌగిలించి) ఆహా! శతానందా! నన్నింత తెలిసికొనలేక పోయితివా?

శతా=దయ్యమునకే తెలియవలె నీ వెవరు?

మాయాప్ర= నేను వీరసేనుఁడఁగదా?

శతా=అబద్ధము.

మాయాప్ర=ప్రవరుని రూపము ధరింతునని నేను చెప్పలేదా?

శతా=నీకే తెలియును నీవు వీరసేనుఁడవుట కేమి దృష్టాంతము?

మాయాప్ర=ఇప్పుడు కావలయునన్నుఁ జూడుము. (వీరసేనుడగును.)

వీర=మిత్రమా! ఇంకైన నమ్మకము గలిగెనా?

శతా=వీరసేనా! ఏమివేషము నీవు వేసికొనునది? ధ్వనివలననైన, దేనివలనైన. నా గుఱుతు

చిక్కవచ్చుఁగదా? ఊఁ హా—

వీర—అట్లయిన నా కోరిక ఫలింపఁ గలుగునా?
శతా—అదిగో తిలోత్తమ వచ్చుచున్నది.
వీర—అయిన నేను మాయాప్రవరుఁడనై యుందును.

శతా—దానికి నీ చందము దెలుపుదునా?

వీర—తుదకుఁ జెప్పుము— (ప్రవరుఁడగును శతా॥ మఱుఁగగును.)

[ ప్ర॥ తిలోత్తమ ]

తిలో—అయ్యో! నాయవస్థ యింతకు వచ్చెను. వీరసేనునికొఱకై యంత చెప్పుచుండినదానను ఇప్పుడు వాఁడెవఁడు—ప్రవరుఁడఁట—వానికొఱకై వెదకుచు రావలసియున్నది. ప్రాణసఖి ప్రాణముకంటె యెక్కువ లేదుగదా? ఇంత మోహము నన్ను ముమ్మరించుచున్నదిగదా? ఆ ప్రవరుఁడను వాఁడెంత రూపవంతుఁడో? అయినను వెదకి చూచెదను. (మాయాప్రవరునియొద్దకువచ్చి) ఆహా! ఏమిది? వెదుకఁబోయిన తీఁగె కాలఁ దగిలినట్లున్నదే? కులజాతులన్నియు నితనియందే యున్నవి. బ్రాహ్మణోత్తమా! నమస్కరించెదను. నీ పేరు నడుగవచ్చునా?

మాయాప్ర—అతివా! సర్వసంగ పరిత్యాగము చేసియు, నొక్కసంగము మాత్రము పాయలేక వేషధారినైయున్న నన్నేలడిగెదవు?

తిలో—భూసురపుంగవా! సజ్జనులగువారికి స్వనింద నైజముకాని యనుగ్రహించి నీ నామము నెఱిఁగింపుము.

మాయాప్ర—రమణీ! ఇప్పుడు నేనున్నట్టున్నవాఁడొకఁడు ప్రవర నామము గలిగియుండెను.

తిలో—ఇప్పుడుగదా నేనుధన్యను? ధరణీదేవోత్తమా! నీవలన నొక జీవదానము కాఁదగియున్నది. నీ చరణములంటి వేఁడుకొనియెదను. నీ వాకార్య మొనర్పవలయు.

మాయాప్ర—అది యేమి చెప్పుము?
తిలో—వాగ్దానము చేసినఁ జెప్పుదును.

మాయాప్ర—అయ్యో! ప్రాణదానము చేయవలయునన్న వలదను మానవుఁడుండునా? అవశ్యము చెప్పుము.

తిలో—నీ విప్పుడు చూచివచ్చిన వరూధిని నా చెలి. అది నీవు తిరస్కరించుటఁజేసి ప్రాణములు వాయనున్నది. ఆ ప్రాణముల రక్షింపవలయు.

మాయాప్ర—ఆహా! తరుణీ! ఇటు నన్ను—

తిలో—వాగ్దానము చేసి యున్నాఁడవు.

మాయాప్ర—నన్నింత నిర్బంధ పెట్టుదువా?

తిలో—విధిలేక వచ్చియున్నది

(అనుబంధము 25.)

నీ చరణములంటి వేఁడెద ననుగ్రహింపుము.

మాయాప్ర—అయిన నా యత్నములేదు. కానిమ్ము.

తిలో—ఇప్పుడు నిక్కముగా ధన్యను. నాకు సెలవా?

మాయాప్ర—పోయి పిలుచుకొని రమ్ము మీ వరూధినిని.

తిలో—భాగ్యము— (తిలోత్తమనిష్క్రమించుచుండ ముందటి యవనికపడును)

[ప్ర॥ శీఘ్రముగ శతానందుఁడు.]

శతా—తిలోత్తమా! ఏమి మిక్కిలి సంతోషముతో రభసముగాఁ బోవుచున్నావు?

తిలో—శతానందా! వీర సేనుఁడేఁడీ?

శతా—నీవుపోయిన చోటనే యున్నాఁడు.

తిలో—చూడలేదే?

శతా—నీయట్టిదాని కన్నులకుఁ గానరాఁడు.

తిలో—అదేల?

శతా—అట్లనే కాని.—నీ సంతోషమునకుఁ గారణము?

తిలో—నిక్కము చెప్పుదునా?

శతా=చెప్పుము.

తిలో=అక్కడనున్న యతఁడెవ్వ రెఱుఁగుదువా?

శతా=నేనేమెఱుఁగుదును?

తిలో=అతఁడు ప్రవరుఁడనెడు బ్రాహ్మణుఁడు.

శతా=అట్లున్నాఁడా.

తిలో=వానిఁగోరి మా వరూధిని ప్రాణములు విడుచునట్లుండెను. నేను వీరసేనునికై యతి ప్రయత్నములు చేయుచుండినను దాని ప్రాణరక్షమునకై వీరసేనుని చింతవిడిచి ప్రవరుని నిష్కర్ష చేసితిని.

శతా=ఉండవచ్చును

తిలో=చూచితివా? వరూధిని యెంత వేఁడినను తిరస్కరించినవాఁడు నే నొకమాట చెప్పునంతను టక్కునఁ గుదురుకొనెను.

శతా=నీవ ట్లనుకొన్నావు.

తిలో=కారణమేమో?

శతా=మనసున కిష్టమయినప్పుఁ డేలయొప్పుకొనఁడు.

తిలో=ఇష్టమటు——ఆరినట్టేయున్నది. వరూధిని యెంత వేఁడినను వలదని వచ్చిన ప్రవరుఁడు నా పాలిటికిప్పుడు వీరసేనుఁడై యున్నాఁడు. నా కంత సులభమాయెను.

శతా=నా పాలిటికి వీరసేనుఁడే ప్రవరుఁడైనట్లున్నది.

తిలో=నా కర్థముకాలేదు.

శతా=అర్థమైన ననర్థమౌను.

తిలో=ఏలా?

శతా=చెప్పెద నిటు రమ్ము. (ఉభయులు నిష్క్రమింతురు.)

[ ప్ర॥ వరూధిని. ]

( అనుబంధము 26 )

వరూ=ఆహా! ఈ దుఃఖమునకు మేరయేలేదు. ఎందెందు వెదకినను నా మనోహరుఁడు గానరాకున్నాఁడు. తిలోత్తమయు రాదాయె. అయ్యో! నా ప్రాణములు నాకింత బరువగునే? దేవత్వమునలనఁ జావులేకున్నది. దుఃఖభాజననై యున్నాను. ఆహా! మానవస్త్రీ లెంతపుణ్యము చేసినారు? ఇట్టి దుఃఖముగలిగినఁ బ్రాణములఁ బోవగొట్టుకొందురు. నేను దేవజాతినై దుఃఖపడవలసి వచ్చెనే.

ఉ॥ ఎంతతపంబుజేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁడవజ్ఞఁజేసినను గాయమువాయుదురే నమర్త్యనై
చింతలవంతలన్ జివికి సిగ్గఱితిన్ మృతిలేనినాదుచె
ల్వింతయుశూన్యగేహమున కెత్తిన దీపికయయ్యెనక్కటా॥

నేనేమి సేయుదును? ఎందుఁ జొత్తును? ఒకరైన నా మొఱాలించువారు లేరుగదా? అకటా! ప్రవరా! నిర్దయ స్వాంతుఁడవై నన్నిటు మదనునిబారి కప్పగించి పోవచ్చునే? ఇంత వంతైన కనికరములేని వాఁడవని యెఱుఁగనైతిఁగదా? ఈ విరహాంబుధి నెట్లు తరింతును.

(వెనుకయవనికనెత్తగా మాయాప్రవరుఁడు కనుపించును.)

(మాయాప్రవరునిఁజూచి) (స్వ) ఆహా! హృదయమా! కొంచము తొందరపడకుము. నాకన్నులెమైన భ్రమసి యున్నవా, లేకనిక్కముగా నామనోవిభునిఁ జూచుచున్నానా? ఇది భ్రమగాదితఁడే నా మనోహరుఁడు. ఇతని పాదతలంబునఁ బ్రణమిల్లుదును. నాకుఁ జూడఁగా నీ మహామహునిఁ గ్రమమున మార్గమునకుఁ దేవలయుఁగాక, మూఢ మోహము చూపిన నుపయోగము లేదని తోఁచుచున్నది. ఇతనికిఁ గామశాస్త్రమునఁ గ్రమశిక్షయొసఁగి చూచెదఁగాక

(ప్ర) భూసురతిలకా! నాపై నంతకోపమూని మాటాడక త్రోసి చెప్పకయే పరుఁగెత్తి రానుక నే నంతపరాధ మేమొనర్చితి? నీ సురూపము గాంచిన పురుషులే, నిను మోహింతురన్న, నే నిను వలచుట నేరమా? నా మోహోక్తికి సదుత్తర మియ్యకున్న మానెఁగాక నా యాతిథ్యమైన స్వీకరింపక వెడలివచ్చునంత పాపము నే నొనర్చితినా? బ్రాహ్మణోత్తమా! నీవిలాసరస మంతయు నీ భార్యనే యనుభవింపఁజేసినను జేయుదువుఁగాని యొక్కింత విచ్చేసి నేనిచ్చు నాతిథ్యమును స్వీకరించిపొమ్ము—మధ్యాహ్నమాయె.

మాయాప్ర—కామినీ! ఆహితాగ్నులమగు మాకు గృహమువిడిచి మసలుట యనుచితము. మధ్యాహ్నమయ్యె నిలుచేరలేక పోయితినేయని దుఃఖించుచున్నాను. నా కేయాతిథ్యమును వలదు.

వరూ—ధరణీసురా! ఇంటిందలంచుకొని భోజనములేక కడుపుం గాలిచికొన్న నేమి సాధించినట్లు? ఒక్కింత భోజనమొనర్చి మీ యింటితెరవునసే పోవుదువఁట రమ్ము.

మాయాప్ర—తరుణీ! నీమాట యథార్థము. ఊరక యగ్నిహోత్రములఁ దలఁచుకొనుచున్న నేమి ప్రయోజనము. నీ యిచ్చచొప్పున నాతిథ్యమున కేతెంచెదఁగాని నన్నొకయరగడియలో విడువవలయును సుమా?

## ద్వితీయాంకము — ద్వితీయరంగము.

వరూ— (స్వగతము) మార్గమునకు వచ్చుచున్నట్లున్నది ఎట్లయిన [illegible]
శము) బ్రాహ్మణా! విడువక కట్టివైచెదనా? అరగడియలో నే [illegible]
యుండి పోవుదువఁట—

మాయాప్ర—ఏమంటివి?

వరూ—ఏమంటిని? అరగడియలో నే నిను బంపుదునంటిని

మాయాప్ర—(స్వగతము) ఈ తన్వి సుద్దుల నెట్టిముద్దులు! ఇప్పుడే [illegible]
వడయుదునా? కూడదు. అతి సులభముగనే జిక్కినట్లు నటించిన నా [illegible]
నో (ప్రకాశము) తరుణీ! నేవచ్చెదఁ గాని నిక్కముగా [illegible]
కిల్లు చేర్చెదవా?

వరూ—పడకటిల్లు చేర్చెదను. అనఁగా నీ కోరిన సతీమణి పడకటింట [illegible]
మొనర్చెదను.

మాయాప్ర—నా కోరిన సతీమణి పడకటింట నను జేర్చితివా, నాకేకాక [illegible]
లభింపఁగలదు.

వరూ—అట్లనా? నాకుఁ బరమానందము లభించునట్లొనర్చెదవా? అయిన [illegible]

(ఇరువురు ముందఱికివచ్చి)

వరూ—(మాయాప్రవరునకుఁదనయింటన ర్ఘ్యపాద్యాచమనాదులిచ్చి పుష్పచందనాదులు [illegible])
మాయాప్ర—(అసమాధానమున్న భంగి నటించుచు నన్నియుఁ గైకొనును.)

వరూ—(అంతరయుక్తైన పిదప) మనోరమణా! ఈ ప్రాణముల నేను ధరింపఁజాలను. [illegible]
ర్చినను, ఈ పుణ్యపాపములు నీకేయుండనీ. అంగీకరించితివా నీగాఢాలింగనసుఖము [illegible]
ప జీవించెదను. మఱియొకభంగి యాయెనా, నీ చరణాంతికముననే యొట్లయినను [illegible]
వులఁ బాసెదను.

మా. యా. ప్ర—అలివేణీ! తాపసవృత్తినూనియున్న నాపై నీ కిట్టి మరులు పుట్టఁజెల్లునే.

(అనుబంధము 27.)

దవ్వుపోఁజాలక యూరుదారి తెలియక గ్లానిజనింపఁగా నింకున్నాను. నను బాధింపకుము.
సెలవిమ్ము.

వరూ—మనోవల్లభా ! నీ వవివేకమన్నను, నసంభావితమన్నను, సాహసమన్నను గాదనను. నేను నీ పాదములాన నిన్ను విడువఁజాలను.

మాయా॥ప్ర—రమణీ ! అయిన నిఁక నా యత్నములేదు. నీ యిష్టము. అయిన నాకుఁ గొన్ని సమయములుగలవు. వాని నీవు పాటింప వలయుఁగదా?

వరూ—ప్రాణేశా ! ఇప్పుడు నేను ధన్యను. సమయములు పాటింపవలయునని నీ వడుగవలెనా? నీ దాసినిఁగదా? నీ వాజ్ఞయొసంగిన దేనినైనను, నేను జేయకుందునా?

(యవనిక దిగజారును.)

---

## తృతీయరంగము — వరూధినిగృహము.

[ ప్ర॥మాయాప్రవరుఁడు మంచముపై పరుండిలేచి. ]

మాయా॥ప్ర—నాపై నెంతయుఁ బ్రేమాతిశయము. దేవేంద్రునిఁబాసి నేను వచ్చి బహుదినములాయెను. నన్ను నిర్జరనాయకుఁడు చారులతో నెన్నిమారులో పిలుపించెను. నే నీవరూధినీ విలాసాంబుధిలో మునిఁగియున్నందునఁ బోవనైతిని. ఇఁక మరియాదగానుండదు. సమయము గలిగియున్నది. వరూధిని యిప్పుడు పూర్ణగర్భిణిగానున్నది ఏదో యొక యుపాయము చెప్పి వెడలెదను.

ప్ర॥ వరూధినిఁ — (గర్భిణి.)

అలివేణి! యిటురమ్ము. నేనును నీ యొద్దకే రావలయునని యుంటిని. నాకు నాఁడు పాదలేప మిచ్చిన సిద్ధపుంగవుఁడు ఈ చెంతనే వచ్చియున్నాఁడఁట, నేనుపోయి దర్శించుకొందును. అతఁడొకవేళఁ దనవెంట నన్ను రమ్మనెనా, అట్లనేపోయెదను. నన్ను క్షమింపుము.

వరూ—హా! నాథా. ఇట్టిదియుంగలదా? ఆ సిద్ధుఁడు నాకుఁ బగదాయగా నిట్లువచ్చునా? నేను నిన్నుఁ బాయఁగలనా?

( అనుబంధము 28. )

మాయా॥ప్ర—వరూధినీ! నీ విటు శోకింపఁజెల్లునే. నశ్వరమైన యీ శరీరమునే నమ్మి యైహికా సౌఖ్యములే యనుభవింపవచ్చునే? ఆత్మతారకములైన యుపాయములు చేసికొనకున్న నేమిప్రయోజనము? రమణీ! నామాట వినుము. మరల రాఁగూడదా? చూడరాదా? నీవు ధీరవైయుండి యిటు లుమ్మలింతువా?

శా॥ ధీరస్వాంతప్రవంతనీకుఁదగునే దివ్యాంగనల్ కోవిదల్
గారేమోగవియోగములృతములే కర్తవ్యముల్సేయరే
పోరేరా ద్రేపియంబుగల్గిన జనుల్పోరామిపోఁబోక్ష నే
పోరాకుండఁగ నేమికాళ్ళు దెగనే ఫుల్లాంబుజాక్షేక్షణా॥

నీవు దుఃఖింపకుము. కన్నీరు నింపకుము. ఇది యటుండనీ. అతివా! నాతల్లి తండ్రుల నేను జూడక యెన్నాళ్ళాయెను చూడుము. వారలనైనఁ జూడరాదా?

(అనుబంధము 29.)

వరూ — ప్రాణేశా! నేను మిక్కిలి మాటలదాననుగాను. ఎటయిననుజేసి నాల్గుదినము లుండి పొమ్ము.

మాయాప్ర — ఓహో నీ ప్రసవమావలకునా? అట్లనే కానిము. నీ కొడుకునుఁజూచియే పోయె దను లెమ్ము. రమణీ! నాకు నిద్ర వచ్చుచున్నది. కొంచము విశ్రమింతును.

వరూ — అవశ్యము విశ్రమింపుము (మాయాప్రవరుఁడు విశ్రమించును.) (కొంచమూరకుండి) ఆహా! ఈ జీవితేశుఁడు ననుఁబాసి పోయిన నాప్రాణము లెట్లుభరింతును? వరించిన నాఁడుమొదలు నేఁటివఱకు ననూనప్రేమాతిశయమున నుంటిమిగదా? ఏమిది యూరక గర్భమున నొప్పి పుట్టెను? ఆహా! అంతకంత కెక్కువయగుచు వచ్చెను? నే నెట్లుతాళుదును? అరయఁగా నిది ప్రసవ వేదనముగానేయున్నది. అయ్యో! ఎట్లు భరింపవలయు. ఆహా! వేదన మెక్కుడగు చున్నది. నాథా! అయ్యో! నిద్రాభంగము చేయవలసి వచ్చునే? అదియుఁగాక తాను నిద్ర పోవునపుడు తనుఁ జూడరాదని చెప్పియుండెను. అది యేటికో? ఏమి వెఱ్ఱితనమో యట్టిస మయము చేసికొనినాఁడు? ఏమో కాని మేలుకొలిపి చూతును.

ఇప్పుడే నా వేదనము కొంచెము కొంచెము నిమ్మళించుచు, వచ్చెను. అయ్యో! ఏమికోపము వచ్చునో! ఏమనునో! ఏమనును? కొంచెము కోపము చేయును, ఎట్లును ఇంతలోననే పోవ నున్నాఁడు. గనుక నస్నేమియు ననఁడు. (ఒద్దకుఁబోయి) ఆహా! ఏమిది నా దక్షిణనేత్రమ దరుచున్నది. ఎట్టి దుఃఖము రానున్నదో. మానుదునా? ఏల మానవలయు? అంత యేమివ చ్చును? నాథా! (అని మేలుకొల్పును. ముసుగుతీయును.)

(వీరసేనుఁడు లేచి కూర్చునును.)

వరూ — (ఉలిక్కిపడి) ఆహా! ఏమి మోసమాయెను? (పడును)

వీర — అయ్యో! కార్యమంతయుఁ జెడియెనే. ఏమిచేయుదును. — వరూధినీ!

వరూ — (లేచి) కఠినాత్మా! నను ముట్టకుము, ఎంత క్రూర కృత్యము చేసితివి? నీపేరెత్తిన నెగచి పడుచున్న నన్ను మోసముచేసి మాయవేషమున నిట్లు ప్రతారించితివే? అయ్యో! నా కీదుఃఖము రాఁదగునే?

ఇట్టి కఠినాత్ముఁడవు గనుక నా శాపము గైకొనుము. నీ వొక గొప్ప పాషాణమవై యడవిలోఁ బడియుండుము.

వీర — తరుణీ! మించినపనికి వగచి యేమిప్రయోజనము? కోపమున శాపమిచ్చితివి. నేనేమందును? అనుగ్రహించి నీ శాపము గ్రమ్మరింపుమా.

వరూ — ఛీ! దురాత్మా! ఇంక నిన్నుఁ జూచినఁ బాపమగును.

వీర — అట్లనా! నిన్నుఁగోరి నే నీపని చేసియున్నాను. నీ వింతమాత్రమైననుఁ గరుణింపక పోయితివి. నన్నడవిని బాషాణముగ నుండుమంటివిగదా? నీవు నాలోనే యుండుము. ఇదె నీకుఁ బ్రతిశాపము. నా శాపము నీకుఁ బ్రసవానంతరమున వచ్చుఁగాక —

కం॥ పాషాణంబుగ శాపము
దోషాకరవదననాకుఁ దొడరించితివే
పాషాణము లేలవినుత
త్పాషాణాంతరమునందే వర్తిలుమీవ్రణ॥

వరూ — పాపాత్మా! ఇంతటి నిష్కారణము నీ కుండునా? కానిమ్ము. ప్రాప్తము నెవరు దప్పింతురు.

(యవనిక దిగజారును)

—:( ద్వితీయాంకము సమాప్తము. ):—.

---

## —: వ రూ ధి నీ నా ట క ము :—

### తృతీయాంకము — ప్రథమరంగము.

(హిమవత్ప్రాంతము ముందరి బయలు.)

—[ ప్ర॥ సరస్వతుఁడను వృద్ధ బ్రాహ్మణుఁడు. ]—

(అనుబంధము 30.)

సర = ఆహా! వార్ధక మెవ్వరికి రావలదు. అయ్యో! (దగ్గుచు) ఈ దగ్గు, ఈ వణకుఁడు, ఈ కీళ్ళ నొప్పులు, ఈ కండ్ల నీళ్ళు, ఈ పండ్లులేనినోరు. ఈ యూపిరి లేమి, ఈ నరసిన కురులు, ఎవరు సహింతురు? ఆహా! కాలమహిమ, ఇరువది యేండ్లకు ముందెట్లుంటిని? అయ్యో! నా కేటికట్టి పిచ్చిపుట్టెను. బంగారువంటి పెండ్లాము రత్నమువంటి కొడుకునుండఁగా వారినివిడిచి తపస్సునకని నేను పోవచ్చునా? ఈ యిరువది యేండ్లనుంచిలేని తలఁపు భార్యాపుత్రులమీదఁ గలుగఁగా నిప్పుడు వెడలివచ్చుచున్నాను. నా కొడుకు నేను పోవునప్పు డైదేండ్లవాఁడు. ఆహా! ఇప్పు డిరువదియైదు. మంచి వయస్సువాఁడై యుండును. వానిరూపము సయితము మఱచి పోయినాను. ఇప్పుడు మా శైలధామపురమున కెవ్వరు మార్గము చెప్పువారు లేరు. నాకుఁ దెలియకున్నది. ముందు పోయి విచారింతును.

(నిష్క్రమించును.)

[ప్ర॥ మఱియొక ప్రక్కన చక్రవంతుఁడనెడు బ్రాహ్మణుఁడు.]
(అనుబంధము 31.)

చక్ర = మాల విధవలు. వీని రాచతన మెంత, వీని వైభవ మెంత? స్వరోచియఁట — రాజఁట — బోగముదాని కొడుకునకు రాజ్యము వచ్చిన నింకెట్లుండును? ఇదేమి తనయబ్బగంటా? నదీతీరమునన్న దర్భకు వీని యధికారమేమి? వాఁడేమి చేయును? వానిభటు లుద్దండులు. మాతండ్రి శ్రాద్ధమునకు దర్భఁ దీసికొనుచుండఁగా స్వరోచియను గంధర్వ రాజువచ్చి విహారము చేయుచున్నాఁడఁట పోగూడదఁట. బ్రాహ్మణుఁడను ఒకవేళ తెలిసియో తెలియకో పోయిన నింతఁగాఁ దన్ని పంపవలెనా? వాని ముండమోయ! ఆ స్వరోచియను వేశ్యాపుత్రుఁ డింక నిట్లయిన నెన్నిదినములు బ్రదుకఁగలఁడు?

పునః ప్ర॥ ఒక ప్రక్కనుండి సరస్వతుఁడు.

సర = (దగ్గుచు) ఎవరయ్యా! అక్కడ?

చక్ర=నీ వెవరు?

సర=నేను వృద్ధ బ్రాహ్మణుఁడను.

చక్ర=నేను పసి బ్రాహ్మణుఁడను.

సర=అయ్యా! నాకుఁ గన్నులు గానరావు.

చక్ర=నాకు చెవులు గానరావు.

సర=శైలధామ పురమునకు దారిఁ జూపుదువా?

చక్ర=శైలధామ పురములో నీ వెవరు?

సర=అయ్యా! అదియంతయు నీకెందుకు? దారి తెలిసియున్నఁ జెప్పరాదా లేకున్న లేదనరాదా?

చక్ర=అయిన నాకుఁ దెలియదు పో.

సర=అప్పా! మెత్తఁగ మాటలాడరాదా? ముసలివాఁడనైన నాతోనా యీ దుడుకుమాటలు?

చక్ర=కాని—కాని—పో.

సర=నీవు చెప్పినను పోయెదను. చెప్పకున్నను పోయెదను. (పోవుచు) జోగి—

చక్ర=ఒరే తాతా! ఏమంటివి? ఇక్కడఁ జూడు.

సర=ఏమో అంటిని. నీకేమి?

చక్ర=ఇంకొకసారి యా మాటననుము. నీ కాళ్ళు విరుగును

సర=నా కాళ్ళువిరిగిన నీ తల పగలును.

చక్ర=ముసలిమోపి! పో. (దెబ్బ వేయును.)

సర=దుడుకుకుంకా! పో. (తిరిగి కొట్టును.)

చక్ర=ఒక దెబ్బ వేసినఁ బ్రాణము లొప్పచెప్పునట్టున్నావే? కాటికిఁ గాళ్ళుచాచి యున్నావే. నీ కీదుర్మార్గమా? (కొట్టును.)

సర—(క్రిందపడును) అయ్యో! పాపాత్ముఁడు నన్నుఁ జావఁదన్నెఁగదా? ఇంక నాకేమిగతి? అయ్యో! ఇరువదియేండ్లక్రిందట విడిచిపోయిన భార్యాపుత్రులను జూడ నింతదూరము ప్రాణములు పట్టుకొనివచ్చి యూరిముందర విడువవలసి వచ్చెనే?

చక్ర—(స్వ॥) ఏమిది? ఇతఁడిట్లు మాటలాడుచున్నాఁడు. శైలధామ పురమఁట—ఇరువదిసంవత్సరములక్రిందట విడిచి పోయెనఁట (ప్ర॥) అయ్యా! నీ పేరేమి?

సర—కష్టాధమా! చావఁగొట్టి నన్ను పేరడిగెదవా? నా పేరుబెట్టి నాకు గర్మాంతరములు చేయుదువా?

చక్ర—(స్వ॥) వీఁడు చెప్పువాఁడు గాఁడు. వీని యిష్టము.

సర—అయ్యో! కుమారా! చక్రవంతా! నిన్నుఁ జూచుభాగ్యము నాకుఁ గలుగదుగా?

చక్ర—(స్వ॥) కుమారా! చక్రవంతా! యనుచున్నాఁడు. నే ననుకొన్నట్లే యున్నది. ఇంకెట్లు మాటలాడుదు.

సర—అయ్యా బ్రాహ్మణా! ఇంత పుణ్యకార్యము చేసి యున్నావు. ఈ పనినైనఁ జేయుము. ఇక్కడనే రెండుక్రోసుల దూరముననున్న శైలధామపురమునకుఁబోయి యా యూరిలో నెల మామిడివారని యున్నారు. వారియింటిలో నున్న చక్రవంతుఁడనువాఁడు జీవంతుఁడయియుండిన నిప్పు డిరువదియైదు సంవత్సరములవాఁడుగా నుండవలయును. పోయివానితో నిరువది యేండ్లక్రిందట మిమ్ముఁ బాసిపోయిన సరస్వతుఁడనెడు తండ్రి మరల వచ్చుమార్గమున నిక్కడనే మృతిఁబొందె—

చక్ర—అయ్యా! నేనే యా పాపాత్ముఁడగు చక్రవంతుఁడను. నాకుఁ గావలసిన శాపము పెట్టుము! (కాళ్ళపైఁ బడును.)

సర—(లేచి) హా! హా! ఏమీ ఏమీ! నీవా? అయిన నీ తల్లి పేరేమి?

చక్ర—అయ్యా! సంశయించెదవా! శారదా దేవిగదా?

సర—(ఆలింగనము చేసి) అయ్యా! కుమారా! నిను క్షమించితిని. ఎందుకు దుఃఖపడెదవు. నీ వేమియు నన్నుఁ గొట్టలేదు. ఏమో కొంచము చేయియట్లు తాఁకినది. నినుగుఱుతించలేక పోయితిని చూచితివా?

చక్ర—అయ్యా! నా పాపమున కింకైన నీడుగలదా?

సర—దానిఁ దలంపకుము. నేనే గుఱుతింపలేక పోయితిని. నీవెట్లు గుర్తింతువు? అయ్యా! నీ విక్కడికేల వచ్చితివి?

చక్ర=ఆ నదీ తీరముననున్న దర్భకు వచ్చియుండగా స్వరోచియను గంధర్వ రాజుయొక్క భటులంట నన్నుఁగొట్టి యిక్కడ విడిచిరి.

సర=అయ్యో! కుమారా! నిన్నెక్కడ గొట్టిరి? (నివిరి) అయ్యో! దర్భకేల వచ్చితివి?

చక్ర=నీవు పోయిన పండ్రెండేండ్లనుంచి నీ శ్రాద్ధములు పెట్టుచున్నాము ఈ దినమే నీ శ్రాద్ధ దినము?

సర=అట్లనా? స్వరోచి యెవఁడు నాయనా? వీరసేనుఁడనువాఁడుగదా నే నున్నప్పుడు గంధర్వ రాజు గానుండెను.

చక్ర=వానికొడుకఁట వీఁడు. వరూధినియను యప్సరసయందుఁ గలిగినాఁడఁట.

సర=అయిన వీర సేనుఁ డెక్కడనున్నాఁడు.

చక్ర=అయ్యో! వాని చరిత్రము మిక్కిలి చిత్రము. వాఁడు బ్రాహ్మణునివేషము వేసికొని వరూధినిని గ్రహించెనఁట. దానికి గర్భమాయెనఁట—ఆ కుమారుఁడు పుట్టుటకుఁగొన్ని దినములకుముందు వీరసేనుఁడు గానరాకపోయెను. వాఁడు పుట్టిన రెండవదినమే, అది కానరాకపోయెను. పది నారేండ్లయినదిగదా? ఇంకను దెలియలేదు. అట్టి యబ్బ యమ్మలేని కొడుకు. గనుక వానిభటులిట్లునన్నుఁ దన్నిరి.

సర=అయ్యో! కుమారా! ఎన్ని దెబ్బలు పడె నాయనా?

(లోపల ధ్వని.)

ఆహా! యేమీధ్వని?

చక్ర=అయ్యా! ఇది సింహధ్వని. ఇంక మనము పోదమురమ్ము. (నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము — అరణ్యము.

[ ప్ర॥ ధనుర్ధరుఁడై స్వారోచియు — ఎఱుకవాఁడు. ]

సరో=ఎఱుకనాయకా! ఉన్న జంతువులనెల్ల నేలకుఁదెచ్చితిమి. మూఁడుదినములు వేటయయ్యె. నీ యొక్కయు, నీ బంధువులయొక్కయు, సామర్థ్యముచూచి మిక్కిలి సంతసించితిని. ఇంక మనము పురికి ప్రయాణము చేయుదము.

ఎఱు=ఆహా! జేజేల గాంచిన సామిచందా! ఇంతలో నేమి చూచితివి. ఇంకను, నా పడమటి యరణ్యమునకు వేటకుఁ బోవనెంచి యున్నారముగదా? అప్పుడు నా మన్నీని తనము కనుంగొనఁగలవు.

సీ॥ సటలెత్తుకొనియొత్తు గిటినైన మోటాన
పడియేయఁబోడుతు నీపాదమాన
కలగుండువడజెందు కరినైనఁజెవిపట్టి
బలిమిమై దెత్తు నీపాదమాన
నెలనెప్పుకొనిరొప్పు పులినైనఁబీడించి
పడవైతుజొచ్చి నీపాదమాన
తెరదూరివెఱబారు గురుపోతుపైనైనఁ
బడియెక్కిపొడతు నీపాదమాన॥

సరో=ఎఱుకనాయకా! నీ వంతచెప్పఁ బనిలేదు. మూఁడు దినములనుండి నీ ప్రభావముఁజూచి యద్భుత మొందియున్నానుగదా?

(లోపల ఆర్తధ్వని.)

అది యేమో యార్తారావము వినిపించుచున్నది. ఏమి యుండవచ్చును?

ఎఱు=(విని) స్వామీ! ఎవో గరితగొంతువోలె తోఁచుచున్నది.

(ప్ర॥ మనోరమ మిక్కిలి భయముతో.)

(అనుబంధము 32.)

మనో=మహాత్మా! నను గాపాడుము. కాపాడుము. (అని స్వారోచి వెనుకకుఁ బోవును,)

(ప్ర॥ రాక్షసుఁడు మనోరమను దరుముకొనుచు.)

(అనుబంధము 33.)

సరో—ఓరీ! నిశాచరా! నీ వెవరవు? ఈ తరుణి నిట్లు తరుముకొనిరాను గారణమేమి?

రాక్ష—నీ వెవఁడవురా! విడువుము దానిని. హా—హా! (అనిఅరచుచుమనోరమయొద్దకుఁబోవును)

మనో—అయ్యో! అయ్యో! రాజేంద్రా రక్షింపుము

సరో—ఓరీ! దానవాధమా! నే నీ తరుణిని రక్షింపఁ గంకణము గట్టితిని. విడిచిపొమ్ము. లేకున్న యుద్ధమునకు నిలువుము.

రాక్ష—యుద్ధమా? మానవా! నీకు యుద్ధమా? నిన్నొక్క పెట్టున మ్రింగెదను. హా! (అని నోరు తెఱచును.)

సరో—దైత్యాధమా! ఈ పర్వతాస్త్రము తాళుము.

రాక్ష—(మ్రింగును.)

సరో—రాక్షసాధమా! ఈ పావకాస్త్రము తిలకింపుము.

రాక్ష—(మ్రింగును.)

సరో—రాక్షసా! ఈ ఐంద్రాస్త్రము—

రాక్ష—(మ్రింగును.)

సరో—(స్వగతము) ఆహా! వీని నింకెట్లు జయింపవచ్చును? ఇంక నీ బ్రహ్మాస్త్రము ననుసంధించెదను. (ప్రకాశము) ఇఁక నీ యాయుపు కడచనెను (బాణమువిడుచును.)

(రాక్షసుఁ డిందీవరాక్షగంధర్వుఁడగును.)

(అనుబంధము 34.)

మనో—అయ్యా! నీవా? ఆహా! ఇట్లేలయ్యెను?

ఇందీ—(మనోరమను గౌఁగిలించుకొని) పుత్రికా! అదియంతయు విధివశము. వీరసేనకుమారా! స్వరోచి రాజోత్తమా! నీవు తెచ్చపడకుము. మీ తల్లియగు వరూధినికి నేను తోడఁబుట్టువు వరుసవాఁడను. ఇందీవరాక్షుఁడను పేరఁబరగు గంధర్వుఁడను ఈ తన్వి నాపుత్రి. బ్రహ్మమిత్రుఁడను బ్రాహ్మణుండు వైద్యశాస్త్రము శిష్యుల కండఁటికి నుపదేశించుచుండి నన్ను శిష్యునిఁగాఁ జేసుకొననని చెప్పినందున బ్రాహ్మణరూపము ధరించి సమస్తము గ్రహించి పిదప నీ సంగతి నంతయుఁ గండకావరమున నాతనికిఁ జెప్పఁగా రాక్షసుఁడవగుమని శాపమిచ్చె. వెంటనే రాజేంద్రా! ఏమని చెప్పుదును! నా శరీరమంతయు నెల్లెట్లో యవుచువచ్చెను.

సీ॥ అభ్రమండలి మోఁచు నందాక నూరక
పెరిగినట్లో మేనునరవరేణ్య
అవధిభూధరసాను వందాకనూరక
పరచినట్లో మేను పార్థివేంద్ర
యబ్జభూభువనంబు నంటాకయూరక
యెగసినట్లో మేను జగదధీశ
యహిలోకతలమంటు నందాకయూరక
పడినయట్లో మేను ప్రభువతంస॥
తే,గీ॥ అఖిలజగముల్క్రమింగు నంతాఁకలియగు
నబ్ధిలేడు ను జెడఁగ్రోలు నంతతృషయు
నచలచాలనచణమైన యదటుగలిగె
నసురభావంబుననుఁజెందు నవసరమున॥

మనో—రాజేంద్రా! నేనును నాచెలికత్తెయగువిభావసి కొన్నిదినముల్కిందట నరణ్యమునఁ బోవుచుండఁగా, ప్రాణములున్నవో, లేవోయను సంశయముకలిగించు భంగి జీర్ణాంగుఁడైన యొక తాపసు నించుక చెనకినందున నతఁడు నను రాక్షసునిచేఁ బట్టువడుమని శాప మొసంగెను. ఇట్లు బాధఁజెందితి.

ఇందీ—రాజేంద్రా! ఇది యెట్టి దైవప్రేరణము. నా చెలియలగు వరూధినియు, నేనును, పలుమారు మాటలాడుచుంటిమి. మాయుభయులను సంబంధ మొనర్పవలయునని పూర్ణాభిప్రాయము కలిగియుంటిమి. నా యభిలాష తెలియునని, యామె కు నీవును, నాకొక కూతురును గలిగె. వావి యుత్తమముగానున్నది. నా తనూభవ నిప్పుడే నీ కొసంగెద.

(లోపల ఆర్తరావము.)

స్వరో—ఏమిది! ఏమో ధ్వని కలిగియున్నది. ఆ దూరమునుండి వినిపించుచున్నది.

ఇందీ—నేఁ బోయి విచారించివత్తు. (పోయివచ్చి) స్వరోచి రాజేంద్రా! అక్కడ నొక్క గొప్ప పాషాణమున్నది ఆ పాషాణము ప్రక్కనుండి యొక వనితయొక్క యార్తధ్వని పుట్టు చున్నది. ఎంత వెదకినను, నాయమ యెక్కడ నున్నదియో తెలియదు. అదిగో వినుము.

(అయ్యో! ఎవరును నావగదీర్చి నను రక్షించువారులేరా?)

స్వరో—పోవుదమురమ్ము.

(వెనుక యవనిక నెత్తగా గొప్ప పాషాణము గనిపించును. పై ధ్వనియు వినవచ్చును.)
ఆహా! ఏమీచిత్రము. ఎక్కడిదో! ఈ ధ్వని తెలియకున్నదే? (మరల ధ్వని) ఆహా! ఇది యీ పాషాణమధ్యమునుండి వచ్చునట్లున్నది. దీని భేదించి చూతుఁగాక. (అని బాణములువేయు) అయ్యో! ఎన్ని బాణములు వేసినను, నిరర్థకమై పోయెనే? ఈ యైంద్రాస్త్రము వేసిచూచెద. ఆహా! ఇదియు వ్యర్థమయ్యె. ఇంక నుపాయమేమి?

(ప్ర॥ సిద్ధుఁడు.)

సిద్ధు—అయ్యా! ఏల యీ భంగి వృథాశక్తి వినియోగము చేసెదవు. ఇది శాపరూపకమగు పాషాణము. నీ బాణములవలన భేదింప సాధ్యముగాదు. బ్రాహ్మణవంశ జాతుఁడై, ఆహితాగ్ని యై, యేకపత్నీ వ్రతుఁడై, నైష్ఠికుఁడై యుండువాఁడు గాయత్రిచే నభిమంత్రించి యుదకము ప్రోక్షించిన సాధ్యమగు. ఈవనమునఁ దపమొనరించుచు బహుకాలమునుండి యీదీనస్వరము వినుచున్నాను.

ఇందీ—స్వరోచి ! ఆర్యావర్తదేశమున, వరుణానదీతీరమున నరుణాస్పదపురమునఁ బ్రవరుఁడను బ్రాహ్మణోత్తముఁడున్నాఁడు. అతనికిఁబై మహిమలన్నియుఁ గలవు.

సరో—అట్లయిన మన మిప్పుడేపోయి మనసేవకులఁబంపి యాతనిఁ బిలిపింతము. (నిష్క్రమింతు.)

సిద్ధు—ఆహా! నా పాదలేపమెంతనర్థకమునకు మూలమయ్యె. దాక్షిణ్యవశమునఁ బ్రవరునికి నాఁడు నే నొసంగిన పాదలేపముతో నతఁడు హిమాద్రికి వచ్చుటయు, వరూధినిచే మోహింపఁ బడుటయు, నా సందర్భమెఱింగిన వీరసేనుఁడు మాయాప్రవరుఁడై, దుష్కృత్య మొనర్చుటయు, నామూలమున, నుభయులు శాపముపాలగుటయు, నీ యాక్రందనధ్వని వినఁదొడఁగినవ నాఁడే, నా దివ్యదృష్టిచే గుఱుతెఱిఁగితి. అయినను పదునాఱేండులకాలము కడచనువఱకు నం దునకుపాయాంతరము లేకుండుట తెలిసి యూరకుంటి ఈ ప్రస్తరాంగశాప మీ వీరసేనుఁ డీ పదు నాఱేండ్లనుభవించినందునఁ బాపశుద్ధుఁడయ్యె. అందునకుఁ దగినభంగి వాని తనయుఁడే యి య్యెడకేతెంచుట ఘటిల్లె. ఇంక వీరియుభయుల బాధల కంత్యము కాఁగలదు.

(నిష్క్రమించును.)

## తృతీయరంగము — వీధి.

[ ప్ర॥ కంధరుఁడు — మంధరుఁడు ]

కంధ—మంధరా! ఇదె పట్టణము కాఁబోలు. ముందు స్తోత్రమాత్రము గనిపించుచున్నది. (కాగితము విప్పి) "వరుణానదీ తీరమున, వరుణాస్పద పురమునఁ బ్రవరుఁడను పేరుగల నిత్యాగ్నిహోత్రుఁడును వైరాగ్యవంతుఁడునునగు" (అని చదివి) ఒక్కరైన దారి నెరుఁగరైనఁగాలేదే విచారింతమన్న? దారిలో వెనుకఁ జెప్పినవాఁడు ఆ యూరిదాపున నే యున్నదనెను.

మంధ—కంధరా! అదియయినఁ గానరాలేదే? పురము మనకెట్లు వచ్చెను?

కంధ—ఏమైనను గానిమ్ము. నా కాయాసముగ నున్నది. ఈ రాత్రియే యంతేమిపని? ఈ శాలయందు విశ్రమింతము. (పండుకొందురు).

ప్ర॥ ఇరువురుదొంగలు.

1. దొంగ—(రెండవ దొంగతో) వరే! పై కేమో యేమీ లేనట్టున్నారు. లోపల దుడ్డు గట్టికొన్నారురా. లేకుంటే యింత పొద్దుకాడే యీ సత్రములో పండుకొనే నేమిరా.

2. దొంగ—వుండని. ఇప్పుడే పీక్కుంటామా? లేక వాండ్లు దోవపట్టనీనా?

1. దొంగ—అంతేలా! ఈండ్లులోనే మనం పండుకొందాం. నిద్రపోయినప్పుడు వస్తిపడ్తె సంపేదే తప్పుతాదిగదా?

కంధ—(లేచి) అదిగో! యెవరో వచ్చునట్లున్నది. అయ్యలారా! (చీటివిప్పి) వరుణానదీతీరమున వరుణాస్పదపుర మిక్కడి కెంతదూరము తెలియునా?

1. దొంగ—మూడామడ.

2. దొంగ—పది ఆమడ.

కంధ—మంధరా! ఇదేమి వచ్చెను.

మంధ—సరి. ఇంకేమి ప్రొద్దున విచారింప వలసినదే.

 (పండుకొని నిద్రపోవుదురు.)

దొంగలు=(వారి నిద్రలో మెల్లఁగా వారియొద్దనున్న ద్రవ్యమును గాగితముతోఁగూడ, దొంగలించుకొని పోవుదురు.)

కంధర }
మంధర } (మేలుకొని దొంగతన మయినది గనుగొని యింకఁ బోవుదమని కాగితము జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని అయ్యో! అన్యాయమా! చీటి పోయెరా యని కంధరుఁడు గట్టిగా నేడ్చును.)

మంధ=ఇంకేమి చేయవలెరా?

కంధ=నాకు జ్ఞాపక మున్నదిలే? ఏమి! ధారనదిగదా?

మంధ=కాదురా, ఏమో "నా" వచ్చుచుండెను. తానాదియుండును.

కంధ=కాదు. అందులో "రా" వచ్చుచుండెను. కారానది—కీరానది—తూరానది—కేరానది చారానది—చీరానది.

మంధ=వచ్చె వచ్చె—చీర్నానది.

కంధ=హా! చీర్నానది—చూర్ణానది—చోర్నానది—ధర్నానది—తర్నానది—మర్నానది.

మంధ=బలా. బలా. మర్నానదే? అదే—అదె.

కంధ=అవతల ఏమి పురమురా?

మంధ=నాకు పురము జ్ఞాపకమే యున్నదిలే. నాకు ఋణబాధలో మిక్కిలి యాపద కలిగియుండెగదా మొన్న? నా పట్టణముపేరు చెప్పువేళకు నది జ్ఞాపకమునకు వచ్చుచుండెను. "ఋణాపద"

కంధ=మర్నానది కాదు. ధర్నానది. ఋణాపదపురము. మంధరా! మనకు తెలివియే లేకుండిన నెంత కష్టముగా నుండెను.

మంధ=అడుగవలెనా? ఇంక నా బ్రాహ్మణుని పేరేమి?

కంధ=బ్రాహ్మణుఁడేనా? కాదురా. జ్ఞాపకము చేసుకో. ఏమో బైరాగియని దానిలో నున్నట్టున్నది. ఏమో అగ్ని అని యుండెను. సత్యాగ్నియో నిత్యాగ్నియో—. అయిన బైరాగి బ్రాహ్మణ బైరాగియే యుండవలయు.

మంధ—సరి. ఇంక వానిపేరు (యోచించి) మా యబ్బతోడు నాకు జ్ఞాపకము లేదు.
కంధ—నాకు నోటిలో నున్నదిరా. ఎవరైనఁజెప్పిన గుఱుతింపఁ గలను.
మంధ—ఇంతేలఁ? ఆ యూరికిఁ బోయి యా బైరాగినే యడిగినసరి.
కంధ—సరి. సరి. మంచియుక్తి చీటి పోయిన నింకఁ బీడ పోయినది లెమ్ము.

ప్ర॥ బాటసారి. 7/15

బాట—అయ్యా! మీది యేయూరు?
మంధ—శైలధామ పురము మాది.
బాట—మణికంధరులు. ఎక్కడికిఁ బోయెదరు?
కంధ—అయ్యా! ధర్మానది. మార్మానది. యెక్కడనున్నది,
బాట—ఏది "పేర్మా?"
కంధ—అదే యుండును.
బాట—కూత వెటెలలోనున్నది.
కంధ—బేష్. బేష్. మంధరా! ఎంత పుణ్యము. పోనీ! ఋణాపద యిక్కడికెంత యున్నది.
బాట—ఏమిటిది?
కంధ—పట్టణము.
బాట—పట్టణమా? గట్టునసే.
కంధ—బలె బలె. ఆ యూరిలో బైరాగి యున్నాఁడా?
బాట—ఉన్నారు. అయిదారు మందిని నేఁ జూచినాను.
కంధ—సెబాస్. అతని పేరేమి? వాఁడెవఁడో అగ్ని—అగ్ని సత్యాగ్ని—నిత్యాగ్ని—.
బాట—ఏమో. అగ్ని వేసుకొని యెప్పటికిఁ గూర్చుండెవాండ్లు. వాండ్ల పేరెవరికిఁదెలియునబ్బా.
కంధ—సంతోషము. సంతోషము. ఇంకఁ జాలును. పోయి వచ్చెదము.

(నిష్క్రమింతురు.)

---

—[తురీయరంగము — పురిలోవీధి.]—

(ప్ర॥ ఏవురు బైరాగులుందురు. అగ్ని ముందు వెలుగుచుండును.)

(అనుబంధము 35.)

[ప్ర॥ కంధర మంధరులు.]

కంధ—(బైరాగుల నొకరి నొకరిఁ బేరడుగును.)

1. బైరా—నా పేరు? బింగు బైరాగి.

2. బైరా—మాధవ్.
3. బైరా—విఠల్.

4. బైరా—సర్దార్ ఔ.

5. బైరా—తవర్.

మంధ—ఆహా! హా! ఇతఁడె జ్ఞాపకమునకు వచ్చె. చీటిలోనున్నది తవరుఁడే.

తవ—అరే. అరే. మై క్యాకరేపలుం.

కంధ
మంధ } (తవరుని వేఁడుకొని, నమస్కరించి శైలధామపురమునకు రమ్మని పిలిచి, కొట్టి తన్ని బైరాగులచే దెబ్బలుతిని "తవరునిఁ" బట్టుకొని యెత్తికొని పోవుదురు.)

(యవనిక పడును.)

---

పంచమరంగము — స్వారోచి కొలువుగృహము.

—[ప్ర॥ స్వారోచి — ఇందీవరాక్షుఁడు.]—.

స్వారో—మామా! మన మూరక యవివేక సేవకులఁ బంపితిమి. రెండు దినములయ్యె వృత్తాంతమే తెలియలేదు. విమానములైన నేమాయెనో? అదిగాక మనమే యా మహాత్మునొద్దకుఁబోయి యుండవలయు. మనము ప్రార్థింప కతఁడువచ్చునో, రాఁడో ఇప్పు డేమయినది. మనము పోవుదము. విమానము నాయితము సేయింతము. (నిష్క్రమింతురు).

షష్ఠమరంగము—పాషాణస్థలము.

(ప్ర॥ స్వారోచి. ఇందీవరాక్షుఁడు. ప్రవరుఁడు మనోరమయు. సిద్ధుఁడు.)

స్వారో—బ్రాహ్మణోత్తమా! ఇదిగో వింటివిగదా? ఇదియేధ్వని. ఇదియే పాషాణము. ఇంక ననుగ్రహింపుము.

ప్రవ—అయ్యా! ఇట్టిధ్వని నే నెందో వినినట్లున్నది. నా యెఱిఁగినవారె యుండఁబోలుదురు. అవశ్యము జపించెద. (అని జపముచేయుటకుఁ బ్రారంభించును.)

ప్ర॥ తవరుని మోసికొని మంధర కంధరులు.

మంధ—(బరువుదించి) మహీశా! మార్కానదీ తీరమున ఋణాస్పద పురమున నుండిన నిత్యాగ్ని బైరాగి తవరుఁడీతఁడె. ఎంత పిలిచినను రాకున్నందున మోసికొని వచ్చియున్నాము.

స్వరో—దురాత్ములారా—

ప్రవ—(మంత్రోదకము చల్లిన వెంటనే పాషాణము పగిలి వరూధినీ వీరసేనులు వెలువడుదురు.)
(అందఱు ఆశ్చర్య పడుదురు)

ఇందీ—అమ్మా! వరూధినీ! నీవా యిట్టి శాపముపాలై బడలినదానవు. అయ్యో! ఏమనవచ్చు నీవిధికి? కుమారా! స్వరోచీ! వీరే నీ తలి దండ్రులు, నమస్కరింపుము.

స్వరో—తల్లి తండ్రులారా! ఇన్నాళ్ళకు మిముజూడఁగలిగెనా నాకు? (నమస్కరించును).

(అనుబంధము 36.)

సిద్ధ—భూదేవతిలకా! ప్రవరా! జ్ఞాపకమున్నదా? పదునేఁడు సంవత్సరములకుఁ బూర్వము నేను మీ యరుణాస్పద పురమునకు వచ్చియున్నప్పుడు, నాయొద్దనున్న పాదలేపము నీకిచ్చి మంత్రోపదేశ మొనర్చియుంటిని. మూఁడవనాఁడే నీవు హిమవంతమునకువచ్చి, మరలఁబోవలేక యందందరయుచు నొక యప్సరో వనితను సందర్శించితివి. ఆయమ నీపై పూర్ణ మోహమున నీ పాణి నభిలషించె. నీ వియ్యకొనకయే, వెడలిపోయితివి. ఈవరూధియే యా యప్సరస. పిదప నా వరూధినియెడ సమధిక మోహము కలిగియు, సదుత్తరము వడయకుండిన యీ వీరసేన గంధర్వరాజు నీ వేషము ధరించి వరూధినిని మోసపుచ్చె. ఆయమయు గర్భము ధరించె. ఈ స్వరోచియే వీరి కుమారుఁడు. బీజమాత్రమునకు, వీరసేనుఁడు కారణమైనను దేజమంతయు నీయది. ఇతఁడు మీ యిరువురకును, బుత్రు డనిపించుకొనువాఁడు. బ్రహ్మతేజ మహిమము గదా? ఈ స్వరోచికిఁ గలుగఁగల కుమారుఁడే, స్వారోచిషుఁడను పేరున ఘనరీతిగా మనువు కాఁగలవాఁడు. వీరసేనా ఈ పదునాలేఁడులను శాపోపహతిచేఁ బ్రుచ్ఛ్రద్రూపము నీవు ధరించినందున నీకుఁ బవిత్రతగలిగె. కావున్న నీ పాపమునకుఁ బ్రాచితము లభింపకుండు. వరూధినీ! ఈ ప్రవరుఁ డేకపత్నీవ్రతుఁడగు మహానుభావుఁడు. వానిపై దుర్మోహము కలిగినందున నే, నీకిట్టి బెట్టిదంపుపాటు ఘటిల్లె. ఈ వీరసేనుఁడు నీకొడుకునకుఁ దండ్రియయ్యె. నీ యెడనున్న ఘనమోహమున నే, యింత దుష్కృతి నొనర్చె. కాఁబట్టి సంశయింప కాతనినే యింక వరింపుము. ఈ సంతోష సమయమున నే, మా కొమారునకును నీ యిందీవరాక్షు పుత్రియగు మనోరమకును, బరిణయ కార్యము గావింపుఁడు.

(వరూధినీ వీరసేనులు మనోరమయొక్కయు స్వరోచియొక్కయు చేతులుకలిపి.)

మంగళమ్ము పాడుదురు.

వరూధినీనాటకము సమాప్తము.

## —: వ రూ ధి నీ నా ట క ము. :—

### ఉత్తరరంగము (*Epilogue.*)

సిద్ధుఁడు.

సీ॥ ధీవందితవరూధినీ వీర సేనులా
రామీచరితమబ్బురంబునించెఁ
బదియునా కోఁడులు పాషాణరూప
శాపములచేఁగడు బాధవడితిరీరు
మీదుఃఖములకోదు మీరెయేలేదుగా.
వాపోయి వాపోయి వనరనయ్యో
విన్నవారలకెల్ల వెక్కసంబుగఁదోఁచెఁ
గన్నవానికినాకుఁ గరుణగల్గె

తే,గీ. నైనమీస్వాంతముల నడలూనవలదు
చాలమీసంకటములు మీమేలుకొలకె
కలిగెననినమ్ముఁడింక నందలిరహస్య
మింతవివరింతు వినఁదగు నెల్లవారు॥

సీ॥ వీరసేనకుమార వివరించికనుమునీ
దుశ్చరితంబింత నిశ్చయించి
బలుమోసమెసఁగంగఁ బ్రవరవేషముదాల్చి
నిన్నుఁగోరకయున్న సన్నుతాంగి
నీవరూధినికాంత నెనసితివిదియును
బరికింపఘోర పాపంబుగాదె
పదియునాకోఁడులు పాషాణరూపంబు
గలిగినోరాడక నిలిచియుండి॥

ఉత్తరరంగము.

తే,గీ. దారిఁజనువెల్లవారలు దన్నియుమిసి
వెగటుగా జలమలములు విడిచిరాచి
యిన్నియవమతుల లడఁగింపకున్న నీదు
పాపమునకెట్లుఁగలిగెడుఁ బాచితంబు॥

సీ॥ రుచిరామలాంగి వరూధినీనీవొన
రించినపాప మింతెంచుకొనుము
అమలమానసుఁడాహి తాగ్నిసుస్థాధికుం
డేకపత్నీవ్రతుం డీప్రవరుఁడు
చారివేడుటకునీ దండకేతెంచిన
మోహించియేమియు ముందువెనుక
లరయక సాహసం బడలఁబైఁబడనుద్య
మించితివి కాదె క్రించుదనము॥

ఆ,వె. ఎంతదేవవేశ్య వేనియునీపాటి
పాపకృత్యమున్నఁ బాడియగునె
నీదుకలుషమునకు నెగడెఁబ్రాయశ్చిత్త
సరణినేఁడు ఘోర శాపముబల.

సీ॥ ప్రవరాఖ్యభూదేవర నీదునిశ్చల
మానసంబదియస మానమయ్యె
ఒంటిపాటునమోహ నోజ్వలరూపంబు
గలయప్సరసనన్ను వలచిరాఁగ

ధీరుఁడవై త్రోచితివి కొనియాడంగ
వలదె నీమహిమంబు నలఘులీల
మఱి నేఁడు వీరి కల్మషములఁ బోకార్చి
యరుదారు నీదు గాయత్రిమంత్ర

ఆ,వె. మహిమ జగమునిండ సహియింపరాకున్న
శాపభంగిఁ దీర్చి తాపమార్చి
యలఘుయశము భూమి వెలయంగ శుద్ధులై
తిరుగఁ గరుణ నించితివి మహాత్మ॥

సీ॥ పరిపంథిమదన నిర్భరవిధానప్రతా
పోజ్జ్వలాహిమరోచి యోస్వరోచి
కొనియాడవలదె నీ ఘనభాగ్యమి దె వీరి
నీతలిదండ్రులు ప్రీతిఁగనుము
తమినిండెఁ బ్రవర భావమె నీదు జననిక
ట్లపుట నీ తేజమీ ప్రవరునిది యె
బీజకారణుఁడయ్యె వీరసేనుఁడు నిర్భ
రంబగు బ్రహ్మ తేజంబె నిండెఁ

తే,గీ. గాననతిమాత్రముగ నీకుఁ గలిగె మహిమ
యీమనోరమను వరియింపు మింపుమీఱ
రుచిరగతి మీసుతుండు స్వారోచిషుండ
మనువు కానున్నవాఁడింక ఘనుఁడతండు॥

---

# అనుబంధము.

ఈ నాటకమున నక్కడక్కడ ననుబంధమును సంఖ్యయును సూచింపఁబడి యున్నది. ఆ సంఖ్యలు వేసినచోటనుండిన పాట లీక్రింద నుదహరింపఁబడి యెడు.

రాగము - శంకరాభరణము ("భక్తిభిక్ష" అను మెట్టు వరుస) రూపకతాళం.

నటి=నన్నుఁబ్రోవుమాధవా - నాపయిదయపాటించి ॥పల్లవి॥

పన్నగవరభవ్యవేద - సన్నుతపర్యంకశౌరి ॥అనుపల్లవి॥

మానితమైనభక్తిని మాయావిదూరనిన్ను

మానసమునబొందు మీఱదలఁచువాఁడ

భూనుతదయచేనిర్మలమైన జ్ఞానమిచ్చినన్ను

రాణవేలువయ్యయింక రామకృష్ణసుకవినుత ॥౧॥

(1) రాగము కమాజు - రూపకతాళం.

వీర=తాపముతాళుదునా - ఈపగిదిని ॥పల్లవి॥

నేనెట్లుతాళుదు మానను తాపము

మానసమదరిపడె - తానిపుడె తాలిమిచెడె ॥౧॥

నాతాపమునుమాన్ప ప్రీతిజేయక నీకు

నీతెఱగిదితగునే - జాణగనే - నవ్వాదఁగునే ॥౨॥

(2) రాగము కళ్యాణి - రూపకతాళం.

వీర=నేనేమిసేతు కోరదె యాకామినినన్ను

తామసించి మీరజాల కామునిబారి ॥పల్లవి॥

ఇంతగనను జేయుననుచు నెఱుగకపోతి

కంతుఁడువిరి శరమువేసి వంతలనించూ ॥౧॥

భామినిమది రాకయున్న భాగ్యమదేలా
పామరత ప్రాప్తమయ్యె - ప్రాణమ్ములేలా ॥౨॥

(3) రాగము కాంభోది - ఆదితాళము.

శతా—పోలదిట్టరీతి యేలగ న్లేకు
మేలుగాదుదీన - లీలవీర సేన ॥ప॥
కనుగానక్కట్టు ఘనరీతిమాని
అనయము తాప - మునదూలనేల ॥౧॥
బలుమోహమున - నలుగఁగనేల
వెలదులువేన - వేలునీకుగాదె ॥౨॥

(4) రాగము చక్రవాకము రూపకతాళము.

ప్రవ—చాలఁగ క్రీదము - లీలమైమీపాదము
చాలగం గ్రాలుగా వెయ్యేలగావంజాలుగా ॥ప॥
పావనముగా జేసెగద నాభవనముం
తయనీక్షణము లోన - దేవధరణీదే
వకుంజరదీన జనములఁగాచుగద ॥౧॥
భానుతంబును భాగ్యమ్ములెన్న పుణ్యమయ్యె
చరిత్రము - జ్ఞానునిమహిమాతీతమయ్యెడు
నేనుధన్యుఁడనై తిఁగద॥ ॥౨॥

(5) రాగము సురట ("సయ్యాటలకు తగినదిరా" - జావడిమెట్టు వరుస) ఆదితాళం.

ప్రవ—ధనాత్ముఁడను నేనునై తిగాఁ- నాదు
పుణ్యముబోగడ నరుదుగా ॥ప॥

సిద్ధపుంగవా నీదయచేతను
సిద్ధిపొందె నాయుష్షితము
బుద్ధినెంచి నన్ను బోచితిగా ||౧||

మోదమొందనా మానసముశంకరు
ణాదరదృష్టినీజూచుచు పాదలేపమిచ్చికాచితిగా ||౨||

(6) రాగము బ్యాగు రూపకతాళం.

పీర — వారిజాక్షినాకునిటు దూరమైపోయినను
ప్రాణముల నైపజాలనే భామ ||ప్రాణ|| ||ప||

మదనుండు శరములం బదనుగనూరి యదనుగ వేసిననునా
రడీచేసి - విధవిధముల నను బాధలను బెట్టినను ||౧||

ఇంతటివిధినాకు - నిట్టులవచ్చునే - ఎంతని తాపము నేను
సహింతు కాంతామణి యింతమది జింతింపక యున్న డేను ||౨||

(7) రాగము అఠాణ ("దాని జూచుచున్నది" జావడిమెట్టు వరుస) రూపకతాళం.

తిల — తాపమొందగదగునే - ఈతీరున
ధైర్యమువిడనగునే - ఊరకే ||ప||
కనకాచలసమాన - ఘనధైర్యుండవునీవు
మునమునవింతటి - వనట చెందరగునె ||౧||
నావంటిమిత్రులు - న్నతరీతిగలుగంగ
నీవిధమునశోక - భావమానననగునె ||౨||

(8) రాగము శంకరాభరణం - రూపకతాళం.

పీర — చేరంగదెనన్నునిటుసతీ - వారణగతిధీరమతి ||ప||

దీనగతినిబొందినాఁడ మానినీమణీ
మానబాణుగెలువఁజేయు - మానితగతి మానవతి ||౧||
సుదతి తాళఁ జాలనింక మదన తాపము
కదసినాకుఁ గౌఁగిలివ్వ - విదితగవా యేమగువా ||౨||

(9) రాగము కమాజు ఆదితాళము.

శతా=సరగున నేలవచ్చితె - మహిషీ
ఎనుమా - బిరబిరబిరబిరయిటు ||ప||
ఆతురమునసీ - నీతెలుఁగునబెను
భూతమువలెన - బ్బిరమొందగా ||బిర|| ||౧||
దున్నపోతులను నెన్నికఁగంటివి
ఖునునిఁజేయుచు - నన్నీగతిబిరబిర ||౨

(10) రాగమి మోహన ("భవనుత" అను మెట్టువరుస) రూపకతాళం.

ప్రవ=చాలఁగనాకునింత మోసమాయెఁగా
చాలఁగనాకునింత మోసమాయెగా
ఈ। శైలభూమి జేరుటె దోసమాయెఁగా ||ప||
మోదమునసిద్ధ - ముఖ్యునినేను
పాదలేపమునకై వేడఁగనీ
రాదనికాదని లేదనియనఁడాయె
నాదరమునవాకు నట్టె యిచ్చెఁగా ||అయ్యో|| ||ప||
భూరికుతూహల - బుద్ధినిమునిని
తారతమ్య మింతఅరయక
చేరికకోరిక లీరికలెత్తఁగ
చారుపాదలేపమేను - కోరఁదగునే ||అయ్యో|| ||౨||

(11) రాగము కల్యాణి రూపక తాళము.

తిలో—ఏమిచెప్ప గానము - కోమలమసమానము ॥ప॥
మదనమాకందము - విదితసుఖాస్పందము
మధురగుణమరందము - ఉదితమహానందము ॥
వితతరాగజాలము - అతిశయయుతాళము
అతులస్వరోల్లాలము - చతురతాలవాలము ॥౧॥
శిశిరవర్ణనాదము - కుశలతావినోదము
విశదగానవాదము - శిశుపశుమోదము ॥౨॥

(12) రాగము నాటకురంజి రూపక తాళము.

పరూ—వలదేవలదే - ఈమాటలు ॥ప॥
చాలఁగనిట్టునను - దూలఁగఁజేయఁగ
బాలనే - నిక - తాళనే - ఇంతేలనే - చలమేలనే ॥౧॥
వారకనిష్ఠురము - వాక్కులనాడుటది
భారమా - నీవైరమా - గంభీరమా - నానేరమా ॥౨॥

(13) రాగము బేహాగు ("వాడలగితే" మెట్టునరుస.) రూపక తాళం

పరూ—కోపముననుమాటలాడెనయారె
ఏపాటినేరము నేఁజేసినానో ॥ప॥
తనమాటే మాటగాఁ గనుకనియీరీతి
ఘనముగనాకు బోధనచేయఁసాగె
మనసునవానిపై తనకుమమతయున్న
ననువానివరియింపు మననేయీచెలి ॥౧॥

(14) రాగము బేహాగ్ ఆదితాళము.

ప్రవ—దారినిఁజూపదరే - నాకిక - దారినిఁజూపదరే ॥ప॥
భీషణవనిలో వీరడనైతి
నౌషధమహిమము నరయకపోతి ॥౧॥

(15) రాగము కల్యాణి రూపకతాళం.

వరూ—ఈ - చారురూపముచూడమెందు మారసుందరుండు ॥ప॥
సురకిన్నరకిం - పురుషులలోన
నరుదుగయిట్టిరూపు మారసుంద॥ ॥౧॥
విలసద్రూపము జలజాతాసుని
నలఘుగతిమీఱినది మార ॥౨॥

(14A) రాగం ఆనందభైరవి అటతాళం.

ప్రవ—దారినిఁజూపరె ధీరమానసులార
ఆరసిల్లియుండుదలఁ కేదమాయయార ॥ప॥
స్వాంతమునవిభీతి - నెంతోయలసినాఁడ
నెంత వేఁడినఁగా వాదగు చింతదీర్పెడువారు లేరె ॥౧॥
పెల్లుగఁగానలో - దల్లడిల్లెడునన్నుఁ
తల్లితండ్రులు లయొద్ద జెరిచియుల్లమలరఁగఁజేయరాదె ॥౨॥

(I6) రాగము సురటి రూపకతాళం.

ప్రవ—బాలామణియీలాగున చాలవెతదూలంగని
కేలామది జాలింబడ వాలాయముగా ॥౧॥
రూ—ప్రేమాంచిత కామర్థితఁ గామించినభామామణి
నీమారిగమా నకుమేమారకుమా ॥౨॥
ప్రవ—కాంతామణిస్వాంతంబున నింతేటికివంతంబడ
చింతాతతియింతైన దురంతంబగునా॥ ॥3॥

వరూ—ధారుణీసురాంజిత నారీమణికోరంగను
ఈరీతినిదూరంబుగఁ బోరాదుగదా ॥౪॥

ప్రవ — బాగా యెనుయేగాఘ్న్యుడు భోగంబుల యోగంబుల
తాగోరసనౌయా గాదన నీగారుడము.
వరూ — ఈదారిని మోదంబును బోదోలగ నేదాళ్ళను
వాదేటికినీధ్యానను - భూదేవవరా ॥౭॥

(17) రాగము అఠాణా రూపక తాళం.

వరూ — నన్నువిడనాడిన - యున్నతియేగలుగు నే
నిన్నికవీడను - చెన్నగు ప్రోడను ॥౧॥
ప్రవ — చాలునింక నీమత - మీలాగుననుండదె
చాలునునీ పేళను - పోలునుపోలును ॥౨॥
వరూ — నీ వేమనియున్నను - నేనేమియుంబలుకను
గావేయని కావుమని ప్రోవుమనివిన్నవింతు ॥3॥
ప్రవ — కాంతామణిసాహస - మింతసతికుండునె
చింతింపగనెంతో జగ జంతయనియెంతుగద
వరూ — నాదుబలు మోహము - ఈదారికి దెచ్చినది
నాదములేదింక కాదనరాదన
ప్రవ — లోకమున వేశ్యలు - లేకయున్న వారలె
నీకైవడి గాసులు లేకున్నారుగాకయింక॥

(18) రాగము ధన్యాసి రూపక తాళము.

వరూ — చలముదీతెనా - దురాత్మా - పొలుపుమీతెనా ॥ప॥
ఆర్తయాచు వేడుకొన్న - యువతివనిట్లు ప్రోయనీకు
కీర్తిదిక్కులందునిండనె - దూర్తయింత కావ లేవు॥

(19) రాగము నాథనామక్రియ రూపతాళం.

వరూ — దీనురాలి - దిక్కులేని - దీనురాలన - భూమిలోన ॥ప॥

దిక్కులేనిదీననైతి - నేమిసేతు ॥దీన॥
ధారణీసురుఁడింత - దయలేకపోయె
కోరవలదె - భూమిలోన ॥దిక్కు॥ ॥౧॥
కావుమంచు వేఁడుచున్న - కరుణలేకపోయె
జీవమేటికీ - నాకునీ - భూమిలోన ॥దిక్కు॥ ॥౧॥

(20) రాగము ధన్యాసి రూపకతాళం.

వీర—మానినీ సీకిటు - దీనతగలిగెనె ॥ప॥
ఈవిధిగలిగెగా - నేమియుపాయము
కావవే శ్రీహరి - కరుణచేదనినిందు ॥౧॥

(21) రాగము పూర్వకల్యాణి ఆదితాళం.

తిలో—ఓ - వరూధినీ లెమ్ము - బిరాన - కమలాక్షీ ॥ప॥
కొందలమేటికి - సుందరి లెమ్మా
ఇంక నన్జూడుము - మందగామిని

(22) రాగము భూపాల ("జన్మమెందుకు" అను మెట్టు వరుస) ఆదితాళం
తిలో—మలయమారుతా - ఖలుఁడవీవుగావె
లలన నేచెదింత - తులువతనమేల ॥ప॥
తామసించియింత - దయలేకయీ
భామబాధబెట్టఁ - బాడియానెకో
పాము వేగనిన్నుఁ - బట్టిమ్రింగనీ
నామమింతలేక - నాశమౌదుగా ॥౧॥

(23) రాగం కమాజు రూపకతాళం.

శతా—పిలువఁగబోయెద - వేగమేవెదకి వామిక్షుని ॥ప॥
ఎప్పుడువరూధిని - తప్పదు వానిమది
నిప్పుడే మోహమున - నెక్కఁడబోయెనో ॥

(24) రాగము తోడి ఆటతాళము.

శతా—అక్కటమిత్రమా - ఎక్కడిcబోతివో
దిక్కులేనిభంగినాకుc - దెచ్చితివేవీరసేనా ॥ప॥
నీవులేకపోయిన -జీవమేలనాకు
దైవమేలమితెచ్చెనాకుc దాళజాలవీరసేనా ॥౧॥
ఎన్నిమాటలన్నను - నన్నుcగాదనుచుంటి
చిన్ననాటినుండియెంతో - చెలిమిగల్గియుంటివయ్యో ॥౨॥

(25) రాగము నాథనామక్రియ ("త్రిలోకమాతనను" మెట్టువరుస) ఆదితాళం.

మా-ప్ర—సుయోగమహిమను గలిగిననాకును
నయోపరాంగన లందఱుతల్లులె ॥౧॥
తిలో—సుయోగమనునది యేటిదియలసతి
వియోగమునcదా జీవముబాయును ॥౨॥
మా-ప్ర—విలోకనముచేయను నేనెన్నcడు
తిలోత్తమా పరభామామణులను ॥౩॥
తిలో—విలోలమానసమున నాచెలిమరు
హాళాహాళికినోర్వదు నీపాదమాన ॥౪॥
మా-ప్ర—అగాళకుతుల యిదేలబుట్టెనా
సరోజముఖికీ - జరుగనికోరిక ॥౫॥
తిలో—పరాకుచేయక ధరాసురోత్తమ
బిరాననేలుము వరూథినీసతి ॥౬॥

(26) రాగము సురటి ఆదితాళం.

వరూ—ఇందునన్నాని - విప్రవరేణ్యాc
డెందుcబోయెనో - నానాథు ॥ప॥
తాళcజాల - మరుశరముల - నాలలితాంగుcజూడక
పాలనసేయ - డయ్యోనాదగు - ప్రాణకాంతుcడు ॥౧॥
ప్రేయువిధముల - వేడినcగానీ - ప్రేయసిగానన్నుప్రీతి
చేయకయెందో - పోయెనికనా - జీవమేటికి - నాకిక ॥౨॥

(27) రాగము మోహన ఆదితాళం.

మా-ప్ర=వర - ధరోద్భవదురోజ సరోజవిలోచనా
నను - వరించుట పాపమాయెనె ॥ప॥

వరూ=వర - ధరాసుర రాజ పరాజితమన్మథా
నను - బరింపఁగా భారమాయెనే ॥ప॥

మా-ప్ర=లస సరాళిదకుంతలా - తగునే, వరింపఁగనుమా
నసమునఁజింత సేయుమా యీవంతెరమేలా ॥౧॥

వరూ=చన - పురాకృతపాపమే - ఇటులీవిధంబుగ వెలయ
ఘనముగనను నేఁచఁగా నిన్ననఁబాపమా ॥౧॥

మా-ప్ర=సుర వారంగనామణిరో - ననుదూరకే
వరమరాళగమనా కోపమేల నేనేకోపనేయో ॥౨॥

వరూ=స్మరశరాళిసహింపఁగా - దరమే - యిదే
వరకరాంజలడి నేవేఁడిన కొనఁగొందయఁజూడరాదా ॥౨॥

28 రాగం ధన్యాసి ("కన్నలిద్దాతకో" కావేరిరంగమెట్టు) రూపకతాళం.

వరూ=అన్ని వేళలందునునీ - హాస్యమేలమనోవల్లభా
ఇన్నినాళ్ళు నామనసెఱిఁగి యింతయేటికి ॥ప॥
నాపైనింతనీకు నేఁడు - కోపమేలకలిగెనో
ఈపగదిని నాడఁగనే - నేమిచేసితి ॥౧॥
ఇంతనన్ను జాలిబెట్టు - చింతయేలనీకుఁగలిగె
కాంతనన్నుఁబాయనేమి వింతపుట్టెనో ॥౨॥

(29) రాగము కమాజు రూపకతాళం.

మా-ప్ర=దూరకుమా - జలజయాతనయనా ॥ప॥
దూరదేశమందుగాదె - చేరియుండుట
ఓ - నారియూరుచేరఁగోరు టౌరయఁగదె ॥౧॥
బాళిసెలవువేడుచున్న లీలజూచియు
ఓ - బాలచాలజాలమేల - పంపఁగరాదె ॥౨॥

30 రాగము పీలు ఆదితాళం.

సర్వ=చాలుచాలు - సకలముగూలు
మాలముసలితన - మేలాగుదూలు ॥ప॥

ఈతలవణకుడు - ఈపాడిగాదు
ఈతీరుననాకు - నెసంగించెనెగ్గు ॥౧॥
పండ్లుపడిననోట - పలుకులేరావు
కండ్లుపొరలుగప్పి - కానఁగలేవు ॥౨॥

31 రాగము బ్యాగు ఆదితాళం.

చక్ర=వేశ్యా - పుత్రుఁడునన్నుఁ దన్నించినాఁడుగా
తన్నించినాఁడుగా - కొట్టించినాఁడుగా ॥ప॥
తండ్రిశ్రాద్ధమునకు - దర్భకు రాగవీని
తండ్రి తాతలగంటూ - వీని - తండ్రి

32 రాగము కల్యాణి - ఆదితాళము.

మనో=ఏమిసేతునే - అయ్యో ॥ప॥
అధికదుఃఖ మొందెనాయె - నసురచేతఁజిక్కెనాయె
విధికిగరుణ లేకపోయె - కెలదిచూచితె ॥౧॥
ఎంత దెఃఖమావటిల్లె - సంతసంబులన్ని చెల్లె
స్వాంత మెల్లిదల్లడిల్లె - చింత సేయగా ॥౨॥

33 రాగము గరుడధ్వని ఏకతాళం

రాకు=వెడలవలదెఘోరత - వెలయనాకారత
అడర భూరిసారత - అలఘుదీరత ॥ప॥
అడర దేయజస్రము - నంగతమిస్రము
కడగిపోయనస్రము - ఘస్రఘస్రము ॥౧॥
నరులనురులద్రోయనె - కరుగగాగాయనే
దారలపొరలవ్రేయనే - దూరఁజేయనే ॥౨॥

34 రాగము నాదనామక్రియ ఆదితాళం.

ఇందీ=శీలా - చాలా - మేలాయే - వర - శీలా
సురచిర - శీలా - వరగుణ - శీలా ॥ప॥
వారకవిబుధా - ధారుఁడవగునీ
వారసినాచింత దీరిచితి - ధీరా - మారా - కారా ॥ శ్రీ ॥౧॥
ఈవిధమున నా - హీనము శాపము
లేవిదళింపగ - వేడుకనన్ - గానా - బ్రోవా - నీవాడ ॥౨॥

35 రాగము సురట ఆదితాళం

బైరాగిలు—నీసాటియెందైనఁగ - ల - దే॥ బళి - బంగేక
బొంగి - ఫోగాక - ఫాగ - బంగేక - వహాహా ॥ప॥
నీపాగనించిన - భూపతిఁజేయుదు
నేపాటిసుఖమనిచె - ప్పు - దు - ఫోవు - తాపము
సంతాపము - తీరు - పాపము - భళిరె ॥౧॥
ఏకాలమునినను - నిత సేవించిన
లోకములేతల క్రిందౌఁగా - ఉ - ద్రేకము
ఆ - నాకము - బ్రహ్మలోకము - ముట్టు ॥౨॥

36 రాగము శంకరాభరణం (నీమేను నామేన మెట్టు వరుస) త్రిపుటతాళం

వరూ—నీపాదకమలము నియతిగొల్చినవారి కేపారశుభ మొందునా
మాపాలిదైవమై మముగావవచ్చితి పాపవితతిదీర్చి
కాపాడికవిగద ॥౧॥
ధీర=భూదేవవర నేడు పుణ్యమేమననీదు- పాదముబొడగంటిమి
ఆదరబుద్ధిచే నరసికాచితిమమ్ము - మోదమునను మేము
మ్రొక్కెదమి దెనీకు ॥౨॥
ప్రవ=ధీరమానసులారా - యూరికయుప - చారిమేట నాకును
ఈరీతిఁబొగడఁగనేమిచేసితి నేను దీరగనిద్దై వాధీనముగా కేమి॥౩॥
ఇందీ=వీరసేనకుమార విభుదవందితపాద పీఠెనీతలితండ్రులు
వీరిపాదములకు వినతిసేయుమునీవు సారగుణులుపాప
దూరులుస్వరోచి ॥౪॥
స్వరో—తలిదండ్రులారమీ - విలసితచరణ - జలజములకు మ్రొక్కెద
పొలుపుగానాదరబుద్ధిమా - మీదనువెలయింపజేయ కేలలి
మీకటాక్షము ॥౫॥
వరూ } ధీరవరకుమార - శ్రీరంజితాకార - కోరిమాఁడఁగగంటిమి
ధీర } నీరమ్యవదనము - నీరీతిమాభాగ్యమారసికొని యాడ నేరము
సుకుమార ॥౬॥

మంగళము.